ఓం శ్రీ సాయిరామ్








# ఆహ్వానము

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి ఆశీస్సులతో ప్రారంభించబడిన "నామ జప పారాయణ" కార్యక్రమము

ది 27-1-95 నుండి 6-4-95 వరకు

ది27-1-95 శుక్రవారంనాడు కురిశేటి హరినాథబాబాగారి ఇంటివద్ద(ఛాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షులు) ఉదయం 10-11 గం॥ లకు ప్రారంభం.

70 రోజులు 70 గృహములయందు వరుసగా భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి నామ జప కార్యక్రమము జరుపబడును.

* ప్రతిరోజు ఉదయం గం. 10-30ని.ల నుండి గం॥12ల వరకు జరుగు కార్యక్రమములు : "ఓమ్"కారము, విఘ్నేశ్వర ప్రార్థన, గురుస్తోత్రము, నవరత్నమాల, జయవిజయీభవ మహిమస్తుతి, భగవాన్ శ్రీ సత్యసాయిబాబా చాలీసా, సాయి అష్టకము, "ఓమ్ శ్రీ సత్యసాయిరామ్" అను నామము మూడు జపములు పారాయణము
* పాదుకాస్తవము, మంగళహారతి. విభూతి ప్రసాదము.

పై కార్యక్రమములో భక్తులందరు విరివిగ పాల్గొని భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అనుగ్రహమునకు పాత్రులగుదురని కోరి ప్రార్థించుచున్నాము.

ఇట్లు

గుడివాడ వెంకటేశ్వరరావుగారు, శ్రీమతి రత్నమాణిక్యాంబ

కటారివారి వీధి, భీమవరం. ఫోన్ : 2011, 3005

**విభూదియే ప్రసాదము**

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు : కొమరగిరి కృష్ణమోహనరావు

ఫిబ్రవరి 1995

సంపుటి : 11

సంచిక : 2



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818



| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రు. 4-50 |
| సంవత్సర చందా | : | రు. 54-00 |
| 4 సం॥ల చందా | : | రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : | రు. 600-00 |
| పోషకులు | : | రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM

Despatched on 9-2-1995


## విషయ సూచిక



ముఖచిత్రం : పరమ శివుడు

సంక్రాంతి సందేశం



# ప్రేమతత్త్వాన్ని పెంచుకోండి!

# ...్యను ప్రేమించండి!

—భగవాన్ సాయి దివ్యప్రబోధ

ప్రేమస్వరూపులారా!

"ప్రేమ అమృత స్వరూపాచ" అన్నాడు నారదుడు. ప్రేమ అమృత స్వరూపము. ఈ బాహ్య ప్రపంచమునందు మానవుడు చతుర్విధ పురుషార్థములను మాత్రమే లక్ష్యమునందుంచుకొని ఇదియే మోక్షానికి తగిన మార్గమని భ్రమిస్తున్నాడు కాదు .... కాదు .... ధర్మ, అర్థ, కామ, మోక్షములు మాత్రమే పురుషార్థములు కాదు. పంచమ పురుషార్థం కూడ ఒకటున్నది. అది మోక్షమునకంటె అతీతమైనది అదియే పరమ ప్రేమ ఈ ప్రేమతత్త్వమే దైవత్వము దైవము వేరు, ప్రేమ వేరు కాదు. దైవమే ప్రేమ, ప్రేమయే దైవము. ఇట్టి ప్రేమ తత్త్వాన్ని మనం గుర్తించినప్పుడే మానవత్వాన్ని కూడనూ మనం అర్థం చేసుకోగలము.

"ప్రేమ తత్త్వము ప్రబోధించి
మమత సమతను పొందుపరచి
మానవత్వము విలువ తెలిపిన
ప్రేమమూర్తియె సాయి దేవుడు"

ప్రేమ తత్త్వము ప్రబోధించి, మమత సమతను పొందుపరచి, మానవత్వపు విలువ తెలిపిన ప్రేమ మూర్తే ఆత్మ దేవుడు. కనుక ప్రేమనే ఆత్మ, ఆత్మనే ప్రేమ ఒక గృహమునందు ముగ్గురు వ్యక్తులు నివసించు సమయములో ఒకరినొకరు అర్థము చేసుకొని, ఒకరి నొకరు అనుసరించి అన్యోన్యముగ జీవించినప్పుడు అదియే స్వర్గము, అదియే అమృతము, అదియే ఆనందము. ఈ విధముగా గాక గృహములో ముగ్గురూ మూడు మార్గములను అనుసరిస్తూ, ఒకరి నొకరు అర్థం చేసుకొనక, ఒకరినొకరు భిన్న భావములను అనుసరిస్తూ ద్వేషిస్తూ, జీవించినప్పుడు ఇంతకంటే నరకము మరొకటి లేదు. స్వర్గ నరకములు రెండును కూడనూ మానవుని యొక్క ప్రవర్తనలపై ఆధారపడి ఉంటు న్నవి మన దేహమే గృహము. ఈ గృహములో మనోవాక్కర్మలనేటటువంటి ముగ్గురు వ్యక్తులు జీవిస్తు న్నారు కనుక ఈ మనస్సు, వాక్కు, ప్రవర్తన ఈ మూడింటి ఏకత్వమే నిజమైన మానవత్వము. దీనినే వేదాంత పరిభాషయందు 'త్రికరణ శుద్ధి' అన్నారు. మనస్సు తలంచిన దానిని మాట రూపకంగా వెల్లడి చేయడం మాటతో వెల్లడి చేసిన దానిని హస్తరూపక ముగా ఆచరించటము - ఈ మూడింటి ఏకత్వమే నిజమైన మోక్షము.

వేదాంతమనగా ఏవేవో అర్థం కానటువంటి గాథకాదు. వేదము ద్వైతము, వేదాంతము అద్వైతము ఏమిటి ఈ వేదాంతము ? ఈ వేదాంతమనేదానిని విచారణ చేస్తూ పోతే దీనికి అంత్యమే లేదు వేదాంతముయొక్క సారము ఈ మూడింటియొక్క ఏకత్వమే. (మనస్సు, వాక్కు, ప్రవర్తన) ఈ మూడింటియొక్క ఏకత్వమును మనం అనుభవించినప్పుడే నిజమైన ఆనందము అప్పుడే దైవత్వమనే ఏకత్వము మనకు ఆత్మతత్త్వమునుగ నిరూపిస్తుంది ఈనాడు లోకంలో వేదాంతాన్ని గురించి

అనేక విధములైన ప్రచార బోధలు జరిపే మహనీయులు ఎందరో ఉంటున్నారు. ఇట్టి వేదాంతాన్ని శ్రవణంచేసే టటువంటి శ్రోతలు కూడనూ వేలాదిమంది ఉంటున్నారు. కాని ఫలితము మాత్రము శూన్యంగా కనిపిస్తున్నది. కారణం ఏమిటి ? ఆచరణలో లేకపోవటమే. ఎన్ని వేదాంతములు బోధించినప్పటికినీ ఆచరణలో లేకుండిన అన్నియు కూడనూ నిరుపయోగమే కనుక ఆచరణలో పెట్టే వేదాంతాన్ని మనం సులభమైన మార్గంలో మనం కనుగొనాలి మనోవాక్కాయములను ఏకత్వము గావించడమే సరియైన మార్గము.

" అంధకారంబెల్ల హతనగారు నే చూడ
వచనములో దీపపు వార్త వలన
రోగపీడితుని బల్ రోగంబుతీరునా
ఔషధ మహిమంబు అంత యున్న
నిరుపేదవాని పేదరికంబు పోవునా
విత్త ప్రభావంబు విన్న యంత
ఆకొన్నవాని ఆకలి తీరునా
పంచ భక్ష్యంబుల పాకము విన"

ఇవన్నీ విన్నంతమాత్రమున మన బాధలు, మన అశాంతులు, మన రోగములు, మన భ్రాంతులు ఏ మాత్రమూ తీరుటలేదు. ఆచరించాలి. ఉపన్యాసాలు చెప్పే దానికంటె సేవచేసి చూపాలి. 'సుహృత్ .... సుహృత్ .... సుహృత్ .... ' అని చెప్పినది గీత ఎవరు నిజమైన మిత్రుడు? స్వార్ధరహితుడైన వాడెవరు? ప్రతిఫలాపేక్ష లేకుండా చేసే మిత్రుడెవ్వరు ? కడపటికి తల్లియైన, తండ్రియైన, భార్యయైన, భర్తయైనకూడనూ స్వలాభాపేక్ష నిమిత్తమై ప్రేమిస్తున్నారు. స్వలాపేక్ష రహితమైన మిత్రుడు జగత్తునందుకానరాడు. స్వార్ధ రహితమైన సేవ సలిపేవాడు ఈ జగత్తులో కానరాడు. స్వార్ధరహితమైన, ఫలాపేక్ష రహితమైనట్టి సేవను ఆచరించేవాడు భగవంతుడు ఒక్కడే. అతనినే 'సుహృత్'అన్నారు అనగా ప్రాణమిత్రుడు భగవంతుడు. భగవంతుడు ఎట్టి ఫలితాన్ని ఆశించడంలేదు. ఎట్టి విధమైన స్వార్ధము అతనియందు ఉండదు. కనుక స్వార్ధరహితమై, స్వలాపేక్షరహితమై, ప్రేమపూరితమై మానవునియొక్క ప్రేమానందాన్ని అనుభవించడానికి పరిశుద్ధమైన తత్త్వములో నిశ్చలమై, నిర్మలమై పరి

(తరువాయి 21 వ పేజీలో)

# మనవి

శ్రీవాణి దశాబ్ది ప్రత్యేక సంచికను ప్రశంసిస్తూ అనేకమంది లేఖలు వ్రాస్తున్నారు. వారందరికి కృతజ్ఞతలు దశాబ్ది ప్రత్యేక సంచిక ఎక్కువ పేజీలతో ముద్రించడం వలన, జనవరి 20 వ తేదీన Post చేయవలసి వచ్చింది సమయం లేకపోవటం వలన ఫిబ్రవరి సంచిక తక్కువ పేజీలతో మాత్రమే ముద్రించబడింది. మార్చి సంచిక మామూలుగా విడుదల చేయబడుతుంది. ఒక నెల తేడాలో రెండు ప్రత్యేక సంచికలు (నవంబర్ '94 & జనవరి '95) పాఠకులకు అందించడం అంత తేలిక మాత్రం కాదు అందులో చందాదారులవద్ద అదనంగా డబ్బు వసూలు చేయకుండా, సాధారణ సంచిక వెలకే ప్రత్యేక సంచికలు అందించబడినాయి శ్రీవాణిని వ్యాపారదృష్టితో నడపటంలేదు. అంకితభావంతో నడుపుతున్నాను నవంబర్ '94 ప్రత్యేక సంచికలకోసం లేఖలు వ్రాస్తున్నారు అయిపోయినాయి కాని సం. చందా రు. 54/-లు పంపినవారికి డిశంబర్ సంచికతోపాటు, శ్రీ సత్యసాయి శతకము (ద్వితీయభాగం) మరియు దశాబ్ది ప్రత్యేక సంచిక (జనవరి '95) లు పంపబడుతాయి స్టాకు ఉన్నంతవరకే ఈ అవకాశం. కనుక త్వరపడండి! క్రొత్త చందాలను వెంటనే పంపండి! ఈ అవకాశమును వినియోగించుకో ప్రార్ధన

– సం

శ్లో॥ శూరాఃసంతి సహస్రశః, సుచరిత్రైః పూర్ణం జగత్ పండితైః
సంఖ్యానాస్తి కలావతాం, బహుతరైః శాంత్రైర్వనాంతాః శ్రితాః
త్యక్తుం యఃకిల విత్తముత్తమ మతిః, శక్నోతి జీవాధికం
సోఽస్మిన్ భూమివిభూషణం శుభనిధిర్భవ్యో భవే దుర్లభః ॥

# అమృతవాణి

## మాచిభట్ల చంద్రశేఖరశర్మ

ఎవరి ప్రాణం వారికి తీపి. ప్రాణం కంటే గొప్పది ప్రపంచంలో లేనే లేదు. ఆ ప్రాణమే లేకపోతే శవమైపోయిన బొందివల్ల యెలాంటి ప్రయోజనంలేదు. కనుక ప్రతివాడూ తన ప్రాణంకోసం యేమైనా త్యాగం చేస్తాడనేది మనందరికీ బాగా తెలిసిన అనుభవం.

కానీ కొంచెం లోతుగా ఆలోచిస్తే మనకు తెలీకుండానే ప్రాణంకంటే ప్రియమైన వస్తువొకటి వున్నట్లు కనబడుతోంది. అయితే దాన్ని అంత తేలికగా అంగీకరించలేకపోయినా ప్రపంచ ప్రాణుల్లో, అంటే మనుషుల్లోనే నిత్యం అనుభవానికి దూరం కాదనిమాత్రం అనిపిస్తుంది అనిపించటమేమిటి – ముమ్మాటికి నిజం కూడాను.

అదేదో మనందరికీ తెలీని పదార్థంకాదు. అదే ధనం ప్రాణం కంటే కూడా ధనం అధికమైందా, గొప్పదా ! అనే సందేహం రాక తప్పదు

ఏ కాలంలో చూచినా ప్రస్తుతకాలం చెప్పక్కర్లేదనుకోండి. ఈ ధనం ఎన్ని చేయరాని పనులయినా చేయించింది, ఇప్పుడు చేయిస్తోంది.

ఏదో విధంగా ధనం సంపాదించాల్సిందే జైలుకుపోయినాసరే, డబ్బుతో సుఖాలన్నీ అనుభవించగలమనే భావంతోనే ఇతరుల ప్రాణాలు ఇట్టే తీసేస్తున్నారు చివరికి ఆస్తులు వచ్చి కలుస్తాయని అన్నదమ్ములనైనా చివరికి తలిదండ్రులనైనాసరే పెద్దమనిషి తరహాగానో రౌడీతనంతోనో ప్రాణాలు తీయటం ఎంత పరిపాటయిందో ఇప్పుడు మనం గమనించటంలేదూ? అదీ ధనముయొక్క ఆధిక్యమంటే ప్రాణాలను త్యాగం చేస్తే నిజంగా ఆయన ఎంత త్యాగపురుషుడండీ అనేవాళ్ళు. ఆ మాట అబద్ధంకాదు కాని తనకున్న కోట్లాది ధనాన్ని గడ్డిపోచలా భావించి త్యాగం చేసే మహానుభావుడు ఇంకా గొప్పవాడట అంత ఉదారబుద్ధి కలవాడు ఈ భూమండలానికే గొప్ప అలంకారమట.

అయితే ఒక్కమాట. ఈ భూమిమీద ఎంతమంది మహా శూరులు, వీరులు పుట్టలేదు? వారివల్ల దేశానికెంత ప్రతిష్ఠకలుగలేదు ? అలాగే జగాజెట్టీలాంటి ఉద్దండ పండితులీ దేశంలో ఎంతమంది పుట్టలేదు ? నలందా. తక్షశిల వంటి విశ్వవిద్యాలయాల్లో వుండిన పండితుల వల్ల దేశానికెంత ఘనకీర్తి వచ్చింది ! ఇక కళాకారుల విషయానికివస్తే వేరే చెప్పాలా ? తాజ్‌మహల్లాంటి కళాఖండాలు, రవివర్మలాంటి కళాస్రష్టలు త్యాగయ్య, తాన్‌సేన్ లాంటి సంగీత జీవనదులు, ఒకటేమిటి ? చతుష్షష్టికళల్లోనూ ఆరితేరిన ఘనులున్నారు. చివరికి అగ్గిపెట్టెలో ఇమిడే వలిపంపు చీరలు నేసిన కళాకారులు కూడా వున్నారు. ఇలా చెప్పుకుంటూపోతే అరవైనాలుగు కళలకు చతుర్దశ విద్యలకు ప్రథమ శ్రేణిలో ఉదాహరణలు చెప్పవచ్చు. ఇదేమీ కొత్త విషయంకాదు ఇంకా చెప్పాలంటే శాంతం మూర్తీభవించిన మునీశ్వరులు హిమాలయాల్లోనూ అరణ్యాల్లోను కూడా ఆధ్యాత్మిక జీవితం గడుపుతున్నారు

నిజానికి ఈ శూరులు, మహాపండితులు, కళాకారులు, మునిపుంగవులు, సాధుపురుషులు ఇలాంటివారెందరెందరో ఈ పుణ్యభూమి నలంకరించి పేరు తెచ్చారు. కాని ఉత్తమోత్తమమైన బుద్ధితో, ప్రాణాలకంటే మిన్న అనుకొనే ధనరాశిని త్యాగం చేయగలుగుతాడో అలాంటివాడే ఈ భూమికంతటికీ నిజమైన అలంకారం సర్వశుభాలకు నిధి అయిన అలాంటి పరమపూజ్యుడు ఈ సంసారంలో దుర్లభుడని చెప్పాలి. 

# భీష్మ పితామహుడు

-కొమరగిరి జయప్రద

భరతవంశ పితామహుడు భీష్ముడు గంగా శంతనుల పుత్రుడు గాంగేయుడు. తండ్రి కోరిక తీర్చుటకై రాజ్యాన్ని స్వ సుఖాలను త్యాగం చేశాడు దేవవ్రతుడు. పంచ భూతాల సాక్షిగా ఆజన్మాంతం బ్రహ్మచర్య వ్రతం చేస్తాననే ' భీషణ ప్రతిజ్ఞ ' చేసి నాటినుండి 'భీష్మ' డైనాడు తమ్ముని సంతతివారైన ధృతరాష్ట్రి, పాండురాజ, విదురులను, కౌరవపాండవులను కంటిరెప్ప వలె కాపాడుతూ, హస్తినాపుర సామ్రాజ్యానికి పెట్టని కోటగా నిలచాడు ధర్మాధర్మములు తెలిసినా, పాండవులు ధర్మమూర్తులని ఎరిగినా ఆపినుండి దుర్యోధనుని సొమ్ము తిన్నందుకు భారతయుద్ధంలో తొమ్మిదిరోజులు శక్తి వంచన లేకుండా కౌరవ పక్షన భీకరంగా పోరుసల్పాడు. భారత యుద్ధానంతరం యుధిష్టరునికి ధర్మోపదేశములు చేస్తున్న భీష్ముని జూచి ద్రౌపది నవ్వింధట, నవ్వు చూసి ఎందుకమ్మా నవ్వుతావు అన్నాడు భీష్ముడు ఏమీ లేదు అన్నదట గుణశీలవు ! కారణం లేనిదే నవ్వురాదు అనగా, ఏమీలేదు. ధర్మమూర్తులు అయిన పాండవులకే ధర్మాన్ని బోధిస్తున్నారు గాని అధర్మ పరులైన కౌరవుల వద్ద ఈ ధర్మపన్నాలు ఏమయినాయా ! అని నవ్వు వచ్చింది క్షమించండి అన్నదట ఆమ్మా ! ఇందులో నీ తప్పు ఏమీలేదు. ఆనాడు దుర్యోధనుని అన్యాయార్జితమైన అన్నాన్ని భుజించటం వల్ల ధర్మనిర్ణయం చేయలేకపోయాను. ధనుంజయుని శరఘాతాలతో చెడురక్తం పోయింది, నా బుద్ధి శుద్ధమయినది. అందువల్ల ధర్మ తత్వాన్ని ఉపదేశించగలుగుతున్నాను అన్నాడుట ఇది నిజమయినా కాకపోయినా దుర్మార్గుల సాంగత్యం మహాత్ముల మీద కూడా ప్రభావాన్ని చూపుతుందనటానికి ఇది నిదర్శనం.

యుద్ధమునకు ముందు, దుర్యోధనుడు భీష్మునితో పితామహా ! మీకంటే మా మేలు కోరేవారు లేరు. నిన్ను జయించువాడు ముల్లోకాలలోనే లేడు ఇచ్ఛా మరణాన్ని వరంగా పొందినవాడవు. ధర్మతత్పరుడవైన నీవే మాకు సర్వ సేనాధ్యక్షుడివి కావాలి అని కోరాడు. నాయనా ! నీవు చెప్పింది నిజం. నాకు ఉభయ పక్షాల యందు అభిమానమే. కాని యుద్ధము నీకోసమే చేస్తాను. పాండవులు వచ్చి నన్ను అర్థించినప్పుడు వారికి హితవు మాత్రం చెపుతాను యుద్ధములో పదివేలమంది యోధులను సంహరిస్తాను, ఒక్క పాండవులను మాత్రం ఏమీ చేయను అని చెప్పాడు భీష్ముడు అర్జునుని గాండీవానికి ఎదురు నిల్చి పోరాడే ఏకైక వీరుడు గాంగేయుడు మాత్రమే. భీష్ముని ప్రతాపం చూసిన ఒకానొక సమయంలో శ్రీకృష్ణుడు 'నేడు భీష్ముని చంపుదు నిన్ను గాతు నిలువుమర్జునా' అన్నాడు. అంతటి పరాక్రమశాలి భీష్ముడు. అందులోనూ ఇచ్ఛా మరణం తప్ప అకాల మరణమే లేదు ఆయనకు అందువల్ల భీష్ముని మరణ రహస్యం తెలుసుకొని యుద్ధం చేశారు ఆఖరున పాండవులు జీవిత సంగ్రామంలో అలసిపోయిన భీష్ముడు పదవరోజు యుద్ధంలో భీకరంగా పోరాడి అర్జునుని రథంపై నున్న శిఖండిని చూచి అస్త్రసన్యాసం చేశాడు. అదే సమయంలో అర్జునుడు అంగుళం ఖాళీ లేకుండా భీష్ముని శరీరమంతా శరములతో నింపివేశాడు సంధ్యా సమయానికి భీష్ముడు రథం నుండి పడిపోయాడు శరీరం నేలను తాకకుండా శరములే శయ్యగా తయారయింది. అది దక్షిణాయనం అవటంవల్ల ఉత్తరాయణం వచ్చే వరకు వేచి ఉంటానన్నాడు గాంగేయుడు ఆధారం లేని తలకు మెత్తని తలగడలను తెచ్చారు. వాటిని నిరాకరించి

# పసిడి మాట

వందమందిని గని గాంధారి దుఃఖించె
కుంతి ఐదుగురితో సంతసించె
లెక్క కొఱకె గుణములేని సంతతి చెల్లు
పర్తి సాయి మాట పసిడి మాట!

పూలమాలలోని పూలకాధారమై
దారమ్ముండునట్టి తీరుగాను
జీవుల వెనువెంట దేవుండు గలడను
పర్తి సాయి మాట పసిడి మాట!

దీర్ఘ జీవితము దేనికి నూరేండ్లు
దివ్య జీవితంబు దినమె చాలు
లేకి బ్రతుకువల్ల లేదు సుఖంబను
పర్తి సాయి మాట పసిడి మాట!

ఏకా రామచంద్రరావు

ధనంజయా! నాకు తగిన తలగడనమర్చు అన్నాడు భీష్ముడు. బాణాలనే తలగడగా చేశాడు అర్జునుడు. శర పీడితుడైన భీష్మునకు దాహం వేయగా సువర్ణ పాత్రలతో శీతలోదకాన్ని తెప్పించాడు సుయోధనుడు. ఈ సమయంలో నేను వీటిని స్వీకరించను, సవ్యసాచీ! నాకు దివ్య జలాలు తెప్పించు అన్నాడు భీష్ముడు. వెంటనే గాండీవి భీష్ముని దక్షిణవైపు పర్జన్యాస్త్రాన్ని ప్రయోగించగా దివ్యామృత జలధార ఉప్పొంగింది.

భీష్మ చరిత్రను సంపూర్ణంగా పరిశీలిస్తే, ఆతను నిష్కామ కర్మయోగి, అస్ఖలిత బ్రహ్మచారి, మూర్తీభవించిన జ్ఞానస్వరూపం ఆయన భగవంతుని స్తుతించిన "విష్ణు సహస్రనామ స్తోత్రం" భీష్మగీతగా ప్రసిద్ధి పొందింది. అంపశయ్యపై ఉన్నప్పుడు, పాండవ అగ్రజుడైన యుధిష్ఠరునికి చేసిన ధర్మోపదేశములు ఏ కాలమందైనను అన్ని రకములవారూ స్త్రీ పురుష భేదం లేకుండా ఆచరింపదగినవి. అన్నీ చెప్పి, ధర్మరాజా! నీవు ఎరుగనిదేమున్నది? శ్రీకృష్ణుడే అన్ని ధర్మములకు మూలం. ఆ వాసుదేవుని నవవిధ భక్తులతో పూజించి తరించాలి. అదే నా ఆదేశము, సందేశము అన్నాడు. సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించాడు ఏభైఎనిమిది రోజులుగా అంపశయ్యపై ఉన్నాను, అని ధ్యానంలో నిమగ్నమయినాడు తేజోమయమై సప్తాశ్వయుతమైన సూర్యరథం మకర సంక్రమణం చేరి ఉత్తరదిశగా సాగేవేళ నేను ఉత్తమ లోకాలు పొందుతాను ఈ శరములతోనే నన్ను దగ్ధం చేయండి అని అంతక్రితమే చెప్పాడు భీష్ముడు. ఇప్పుడు మాఘశుద్ధ ఏకాదశి సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించాడు. పితామహుడు నిర్యాణం చెందే రోజు వచ్చింది. పాండవులు, శ్రీకృష్ణుడు వ్యాస నారదాది మహర్షి శ్రేష్ఠులు అందరూ వచ్చారు. అందరికి నమస్కరించి భీష్ముడు శ్రీకృష్ణుని వైపు చూచి పరమాత్మా! సర్వులకు రక్షకుడివి, నా దేహ పరిత్యాగానికి అనుమతి ప్రసాదించు మహాత్మా అన్నాడు. వాసుదేవుడు చిరునవ్వుతో అనుజ్ఞను ప్రసాదించాడు. అంత పితామహుడు బుద్ధీంద్రియములను ఏకాగ్రంచేసి శ్రీకృష్ణుని స్తుతించాడు, భీష్ముని ప్రాణవాయువులు భగవంతునిలో లీనమయినాయి. అంబర వీధిలో దేవ దుందుభులు మ్రోగాయి, దేవతలు భీష్ముని శరీరంపై పూలవాన కురిపించారు. ఆ సమయంలో గంగాదేవి శోకవ్యాకులితయై వచ్చింది. వాసుదేవుడు, వేదవ్యాసాదులు ఆమెను ఓదార్చి నీ కుమారుడు తండ్రి ఇచ్చిన వరంతో ఇచ్ఛామరణం పొంది ఉత్తమలోకాలు చేరుకున్నాడు అతనికై నీవు బాధ పడవద్దు మాతాపితృ వాక్య పరిపాలకుడు, మహాజ్ఞాని అయిన ఆయన కీర్తి ఆచంద్రార్కము నిలుస్తుంది అని చెప్పారు. భరతవంశ మూలపురుషుడు కురువృద్ధ పితామహుడు అయిన భీష్ముడు నిర్యాణం రోజే "మాఘశుద్ధ ఏకాదశి" అదే "భీష్మ ఏకాదశి" పర్వదినం.

# శివతత్త్వము

-పునర్వసు

కంఠేయస్య లసత్కరాళ గరళం
గంగాజలం మస్తకే
వామాంకే గిరిరాజ తనయా
జాయా భవానీ సతీ ।
నందిస్కంద గణాధిరాజసహితః
శ్రీ విశ్వనాథప్రభుః
కాశీమందిర సంస్థితోఽఖిల
గురుర్దేయాత్ సదా మంగళమ్ ॥

సర్వ వ్యాపి, సర్వేశ్వరుడు అయిన సదాశివుడు క్షీరసాగర మథనమున జనించిన మహా భయంకరమగు హాలాహలాన్ని లోక క్షేమము కోరి, తన కంఠమందే నిల్పుకొని, సమస్త లోకాలను కాపాడిన పర్వదినము మహా శివరాత్రి ఆ రోజు విశ్వేశ్వరుని భక్తితో ఆరాధించిన వారికి ఆత్మసామ్రాజ్య సందర్శానానందము లభింపగలదు

'శివము' అనగా 'శుభము' శుభములనిచ్చువాడు 'శివుడు' మంగళకరమైన 'శివ' శబ్దంలో పరమేశ్వర మహా తత్త్వము ప్రతిష్ఠితమై వున్నది

'శివ' అను రెండక్షరములు మానవుని పరమేశ్వర పద సాన్నిధ్యమును చేర్చు హంస రెక్కల జంట అనవచ్చును. ఆ రెండక్షరములే సంసార జలధికి ఇరు వైపుల గల ఒడ్డులు. ఈ అక్షర ద్వయమే ఆత్మజ్ఞాన బీజమునకు ప్రథమ దళములు. ఈ అక్షరములే సంసార వృక్ష బీజములు మరియు జన్మరాహిత్యము నొసగు వేద రహస్యములు అని శ్రీ జగద్గురు శంకరాచార్యుల వారు 'శివ పదమణిమాల' యందు సెలవిచ్చియున్నారు.

'శివే' అన్న ఒక్క నామంలో పార్వతి పరమేశ్వరులు ఇమిడి వున్నారు. 'శివ' అను అక్షరద్వయమే ఈ సకల చరాచర సృష్టికి కారణము. ఈ బ్రహ్మాండమంతా శివలింగమే.

శివరాత్రినాడు అర్ధరాత్రి సమయంలో శివుడు లింగోద్భవమూర్తిగా ఆవిర్భవించడం జరిగింది ఒకానొకప్పుడు బ్రహ్మకు విష్ణువుకు 'తామిరువురితో ఆధిక్యత ఎవరిది?' అన్న వివాదం ఏర్పడింది. ఆ సమయంలో కోటి సూర్యుల తేజస్సుతో వారి ఎదుట ఒక లింగం ఆవిర్భవించింది. దిగంతరాళాలను నింపివేసింది బ్రహ్మ విష్ణువులు ఆ లింగం మొదలు, తుది తెల్సుకోవాలని నిశ్చయించుకున్నారు. బ్రహ్మ హంస రూపాన్ని ధరించి శిఖరం వైపు వెళ్ళాడు. విష్ణువు వరాహ రూపంలో లింగ పాదాన్ని అన్వేషిస్తూ భూమిలోకి చొచ్చుకుపోయాడు. వారికి పాదం కాని, శిఖరంగాని అవగతం కాలేదు. అప్పుడు ఈశ్వరుడు లింగోద్భవ మూర్తియై వారికి దర్శనమిచ్చి బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల అభేద్యాన్ని విపులీకరించాడు

భక్తులు శివరాత్రినాడు లింగోద్భవకాలం వరకూ మేలుకొని ఉండి సమస్త చైతన్య స్వరూపుడు, ఆది మధ్యాంత రహితుడు అయిన పరమ శివునికి అభిషేకములు నిర్వహించుతారు.

ఉపవాసము, జాగరణ చేస్తారు

మహా శివరాత్రి మాఘ బహుళ చతుర్దశి రోజు.

'చతుర్దశి' అనగా 14. (పదునాలుగు)

జ్ఞానేంద్రియములు అయిదు (5)

కర్మేంద్రియములు అయిదు (5)

ఈ ఇంద్రియములు పది + బుద్ధి + చిత్తము + అహంకారము + మనస్సు చేరి మొత్తం పదునాలుగు.

వీటిని అన్నింటినీ ఏకముచేసి పరమేశ్వరునియందు లగ్నము చేయుట.

ఇదే ఉపవాసము 'ఉప' అనగా సమీపమున లేక దగ్గరగా వాసము, నివశించుట.

పై 14 వాటిని ఏకముచేసి పరబ్రహ్మ భావములో నుండుట అని.

జాగరణ : ఒక్క క్షణమైనా (మరపురాకుండ) జాగు చేయక దైవీభావముతో మనస్సు నుంచుట జాగరణ మనబడును.

(గాని నేడు 'తిలయంత్ర ఘటిత వృషభం' వలే టి.వి లు, సినిమాలు చూస్తున్నారు)

"కరలగ్న మృగః'' ఈశ్వరునికి కుడి చేతియందు జింకపిల్ల వుంటుంది. జింక స్వభావం అతి చంచల మయినది. మానవుని మనస్సు కూడా అతి చంచలం కలిగి వుంటుంది. శివుని చేతియందున్న హరిణం తన స్వభావాన్నే అధిగమించి ఈశ్వరుని కరుణా కటాక్ష వీక్షణాల యందు ఆనందంతో మునిగివుంటుంది.

**విభూతియే ఆయన అలంకారం**

పరమశివుడు సర్పభూషణుడు. సర్పము మృత్యువుకి ప్రతీకం. శివుడు మృత్యుంజయుడు. సర్పం కుండలినీ శక్తికి కూడా ప్రతీకం. శివుడు మహా యోగీశ్వరుడు, యోగేశ్వరుడు కూడా.

వృషభవాహనుడు, వృషభం అహంకారానికి చిహ్నం, అహంకారాన్ని అణచి అధీనంగా వుంచుకొన్న వాడు పరమేశ్వరుడు.

ఏనుగు చర్మంగాని, పులి చర్మంగాని ధరిస్తాడు. ఏనుగు పశువులలో పెద్దది. శివుడు పశుప్రవృత్తులను సంపూర్ణంగా అణచివేశాడన్నమాట.

పులి జంతువులలో క్రూరమైనది. ఇది కోరికలకు ప్రతీకం. శివుడు కామారి కనుక కామ (కోరికల) జయానికిది చిహ్నం.

వరాల దేవుడుగా పేరు పొందిన శివునివల్ల దుష్ట రాక్షసుల వరాలు పొంది తిరగబడిన భస్మాసురుని గాధవల్ల మనస్థాయికి తగిన దానినే కోరుకోవాలి అని తెలుస్తుంది. పార్వతీ పరమేశ్వరులు, గణపతి, కుమారస్వామిలను 'వసుధైక కుటుంబము'గా వర్ణించి నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

పరమేశ్వరుని హారాలు పాములు, వాహనం ఎద్దు.
పరమేశ్వరి వాహనం సింహం
వినాయకుని వాహనం ఎలుక
కుమారస్వామి వాహనం నెమలి

ఇలా వీరి వాహనాలు పరస్పర విరోధమైనవి అయి ననూ కలసిమెలసి వుంటూ సర్వప్రాణికోటికీ శుభాలను చేకూరుస్తున్నారు.

పరమశివుని పాదాలను ఆశ్రయించి ధన్యులైన పరమ భాగవతోత్తముల చరిత్రలు ఎన్నో మనలను జాగృతం చేస్తూవున్నాయి.

ఆయనను ఒక్క శివరాత్రి రోజు అనే అక్కర లేదు ఏ క్షణాన "శివశివా" అంటే 'ఓయ్' అని పలుకు తాడు.

'' నమస్తే అస్తు భగవాన్ విశ్వేశ్వరాయ, మహా దేవాయ త్రయంబకాయ, త్రిపురాంతకాయ, త్రికాగ్ని కాలాయ, కాలాగ్ని రుద్రాయ నీలకంఠాయ, మృత్యుం జయాయ సదాశివాయ శ్రీ మన్మహాదేవాయ నమః '' అని ప్రార్థించుదాము. ○

" మంచివారిని చూచి ఈర్ష్య పడరాదు ఈర్ష్యయే అన్ని అనర్థాలకు మూలము. మంచి స్థితిలో వున్నవారిని చూచి సంతోషించండి. హీనస్థితిలో వున్నవారిని చూచి జాలి పొందండి సహాయం చేయగల్గిన చేయండి. హాని మటుకు చేయవద్దు. "

– శ్రీ సత్యసాయిబాబా

అంతుబట్టని అద్భుతాలు-14

# బ్రహ్మరాత

-భండారు పర్వతాలరావు

యుగోస్లావియా రాజధాని బెల్‌గ్రేడ్‌కు ఈశాన్యంగా 250 కి. మీ. దూరంలో టాటారియా అనే గ్రామం వుంది. ఇక్కడ 1961 లో జరిగిన తవ్వకాలలో మూడు మట్టి బిళ్ళలు దొరికాయి. వాటిపై వున్న లిపిని యింతవరకు ఎవరూ చదవలేకపోయారు. ఈ బిళ్ళలు దొరికినచోట చిన్న చిన్న విగ్రహాలు దొరకటం వలన ఈ బిళ్ళలపై రాసిన విషయం ఏదో మత సంబంధమైన పూజలకు సంబంధించినది అయివుండవచ్చని అనుకుంటున్నారు. లేక యివి పూజలో వుపయోగించే 'యంత్రాల' వంటివి కూడ కావచ్చు ఇందులో రెంటి కొనలలో రంధ్రాలున్నాయి కనుక వాటిని తాయెత్తులుగా వాడివుంటారు. ఈ బిళ్ళలతో వారేం చేశారో తెలియదు కాని ఆ 'పూజ' ఏదో అయినతర్వాత పూజాసామాగ్రి అంతటినీ ఎందుకో తగలపెట్టారు. అందువల్ల ఈ మట్టి బిళ్ళలు చక్కగా ఆవంలో కాలిన కుండపెంకుల్లా తయారయి యిప్పటికీ చెక్కుచెదరకుండా వుండిపోయాయి. ఇవి కొత్త శిలాయుగంనాటివి.

ఇలా ఎవరూ చదవలేకపోతున్న 'బ్రహ్మరాతలు' యింకా వున్నాయి. ఫ్రాన్స్‌లోని మజ్‌ద అజిల్ (Mas d' Azil) వద్ద ఒక గుహలో కొన్ని వేల గులక రాళ్ళు పదిలపరచబడి వున్నాయి. ఇవన్నీ సన్నగా, పొడుగ్గా నువ్వుజీడీల్లా వున్నాయి. వీటిమీద రకరకాల గుర్తులు చిత్రించబడ్డాయి. ఇవి ఆ కాలంలోని లిపి కావచ్చని ఊహిస్తున్నారు.

ఇక సిరియాలోని టేల్ మార్డిక్ (Tell Mardik) అనేచోట ఒక పెద్ద గ్రంథాలయమే లభించింది బలమైన ఇబ్లా సామ్రాజ్యానికి ఈ పట్నం రాజధాని. అక్కడి కోటను ఎవరో జయించి తగలపెట్టారు. కోట అంతా ధ్వంసమయింది కాని అందులో వున్న ఈ గ్రంథాలయం మాత్రం చెక్కుచెదరలేదు. కారణం అక్కడి పుస్తకాలను కాగితంపైనా, భూర్జర పత్రాలపైనా, తాటాకులపైనా రాయలేదు మట్టి పెంకులపై రాశారు. అలాంటి పెంకులు 15000 దాకా భద్రంగా వున్నాయి. కాని వాటిని అధ్యయనం చేయటం సాధ్యం కావడంలేదు. ఇవన్నీ క్రీ॥ పూ॥ 2400 ప్రాంతానివి

అలాగే సూడాన్‌లోని మేరో వద్ద కొన్ని శిలా శాసనాలు దొరికాయి. శాస్త్రజ్ఞులు ఎంతో శ్రమించి ఈ లిపిని చదివే ప్రణాళిక సిద్ధం చేశారు చదవటం చదివారు కాని అందులో ఏ ఒక్క మాటా అర్థం కావడంలేదు! ఈ మేరో వాసులు కూడ ఈజిప్టు పౌరులలాగా పిరమిడ్లను కట్టి అందులో చనిపోయిన వారిని సమాధి చేసేవారు. అయితే పిరమిడ్లు పెద్ద సైజువి కానందున వాటికి ప్రశస్తి రాలేదు.

భారత ఉపఖండంలో సింధూనదీ తీరంలో మొహంజొదారో, హరప్పా మొదలైన పట్టణాల వద్ద తవ్వకాలు జరుపగా సింధు నాగరికత బయల్పడింది. అక్కడ వందల సంఖ్యలో ముద్రలు (మన రబ్బరు స్టాంపుల వలె, లోగడ రాజముద్రికలవలె గుర్తువేసేవి) లభించాయి. ఈ సీళ్ళ (Seals) పై అనేక బొమ్మలూ, వాటితోపాటు కొన్ని అక్షరాలు ఉన్నాయి. మొత్తంమీద అలాటి అక్షరాలు 400 పైగా లభించాయి కాని శాస్త్రజ్ఞులు ఎంత ప్రయత్నించినా వీటిని చదవటం సాధ్యంకాలేదు కొంతమంది తాము వీటిని చదవగలిగామని ప్రకటించినా వారి కృషి శాస్త్రజ్ఞులను తృప్తిపరచలేకపోయింది సింధు ప్రాంతానికి చెందిన సీళ్ళపై గల లిపిని చదివి అర్థం చేసుకోగలిగితే మన ప్రాచీన నాగరికతకు సంబంధించి ప్రస్తుతం నిగూఢంగా వున్న అనేక విషయాలు వెలుగులోకి రావచ్చు ●

# అహంకారం

సోమంచి రామం

మానవుడు తనకు సిద్ధించిన జ్ఞాన సంపదకు తానే కర్త యని భావిస్తాడు. తానధిరోహించే ఉన్నత పదవి స్వయంసాధితమేనని స్వాతిశయిస్తాడు. తాను కూడబెట్టిన ధన, కనక వస్తువాహనాదులన్నియు స్వీయ ప్రతిభాజనితము లేనని భ్రమిస్తాడు. తనకు లభించినదంతయు తన ప్రయోజకత్వ ఫలితమేనని విఱ్ఱవీగుతాడు. తాను భగవదాంశమని, తన జీవితమే భగవత్ప్రసాదమని తలపోయడు. భగవదనుగ్రహము లేనిచో, తానేమీ సంపాదించలేడని, సాధించలేడని గ్రహించలేడు. భగవత్ప్రసాదితములగు సంపదలన్నింటికి తాను కేవలము ధర్మకర్త మాత్రమే యని గుర్తించుకొనడు. తాను నిమిత్తమాత్రుడేనన్న అవగాహన లేక, స్వశక్తితోనే తావింతవాడినైతినని అహంకారముతో సంచరిస్తాడు. అహంకారము అనర్థదాయకము. ఎంతటి ఉన్నతుడైనను అహంకారికి అంతమందు లభించేవి, పరాభవ, పతనములే! అహం వీడని మనిషికి నిష్కృతి లేదు. అందుకు మన పురాణములందుదాహరణములు కోకొల్లలు.

ద్రోణుడు, ద్రుపదుడు చిన్ననాటి స్నేహితులు. దారిద్ర్య బాధతో సంసారాన్ని పోషించలేక, ద్రోణుడు ద్రుపదుని చేరి సహాయమర్థిస్తాడు. ధనమదంతో విఱ్ఱవీగుతున్న ద్రుపదుడు ద్రోణుని పరిహసించి, పరాభవిస్తాడు. అవమానభారం ద్రోణునిలో ప్రతీకారేచ్ఛను రగిలిస్తుంది కౌరవ పాండవ రాజకుమారులకు గురువై, వారికి అస్త్ర శస్త్ర విద్యలనుపదేశిస్తాడు ద్రోణుడు. విద్యాభ్యాసం పూర్తికాగానే గురుదక్షిణగ, యుద్ధమందు ద్రుపదుణ్ణి ఓడించి, బంధించి, రథానికి కట్టి తెమ్మని కోరుతాడు. అందరి వీరులలోను అర్జునుడే గురువుగారి కోరిక సీడేరుస్తాడు. అహంకారి ద్రుపదునికి తగిన పరాభవం జరిగింది.

'అహంకారం మబ్బువంటిది. అహంకారం నశించనిదే మానవునికి ముక్తి లభించదు' అంటారు రామకృష్ణ పరమహంస. అందులకాయన చక్కని కథ నుదహరిస్తారు.

తనను మించిన విష్ణుభక్తుడు లేడని నారదుని అహంకారము. దానిని గ్రహించిన భగవానుడు నారదునికొక సామాన్య భక్తుని జూపి, 'అతడే నా ఉత్తమ భక్తు'డనెను ఆతడు ప్రాతఃకాలమున నిదురలేవగనే 'హరి' ని స్మరించి, దినమంతయు సంసార భారమును వహించి, రాత్రి మరొక్కమారు 'హరి' ని స్మరించి నిద్రించును అహంకారమతిశయించిన నారదుడు 'ఆతడుత్తమ భక్తుడెట్లగు' నని ప్రశ్నించెను. అందుకు సమాధానముగా 'ఈ నూనె గిన్నెను చేతబుచ్చుకొని తైలము ఏమాత్రము తొణకకుండ పురమంతయు జుట్టి రమ్మ' ని భగవానుడాదేశించెను. సాయం సమయాన తిరిగి వచ్చిన నారదుని జూచి, 'నారదా ! ఈ దినమున నీవు నన్నెన్ని పర్యాయములు తలచుకొంటివి ? ' అని అడిగెను. "ఎక్కడ స్వామీ ! తైలము తొణకకుండ చూచుటయందే మనసు లగ్నమైపోయినది. ఇక మిమ్ములను తలచు నవకాశమెక్కడ ? ఒక్క పర్యాయమైనను మిమ్ములను స్మరింపలేదు" అనెను అంతట భగవానుని మందహాసపు మందలింపుతో నారదుని అహంకారము అంతరించింది.

నడమంత్రపు సిరిలా యింద్రపదవి లభించిన నహుషుని అహంకారం ఆవేశించింది. అధికారమదం అతని కళ్ళకు పొరలను కప్పేసింది ఇంద్రుని సతి,

శచీదేవిని చేబట్టదలచాడు. ఆమె భయవిహ్వలయై బృహస్పతి శరణువేడింది. పరస్త్రీ పొందు కోరుట తగదని, దేవతలు, మునులు హెచ్చరించారు. కామాంధుడైన నహుషునకా బోధలు చెవికెక్కలేదు. దేవి కృపవలన, అజ్ఞాతమందున్న భర్తను కలుసుకొన్న శచీదేవికి, అపాయము తప్పించుకొను ఉపాయము తెలిపాడు యింద్రుడు సప్తఋషులు బోయీలుకాగా నహుషుడు పల్లకినెక్కాడు. శచీదేవి పొందుకై తహతహలాడుచున్న అతడు 'సర్ప', 'సర్ప' అనుచు అగస్త్యమహాముని శిరమును కాలితో తన్నెను అగ్రహావేశుడైన అగస్త్యుడు 'పదవీభ్రష్టుడవై, మహాసర్పము వలె పడియుందువ' ని శపించెను. మహాత్ముల వాక్కులూరకపోవు ! అహంకార ఫలమునసుభవించాడు నహుషుడు.

మాన్యులకైనా, సామాన్యులకైనా, మహర్షులకైనా అహంకారము అలంకారము కాదు, అనర్థదాయకము. తనలోని అహంకారమును మట్టుబెట్టిన మనిషే మనీషి.

)-○-(

సైన్స్‌వాణి - 2

## ముంచుకొస్తున్న ముప్పు—

.కె. ఆర్. కె. మోహన్

వాతావరణ కాలుష్యం మూలంగా గాలిలోని కార్బన్‌డైఆక్సైడ్ శాతం అంతకంతకీ పెరుగుతోంది ఫలితంగా ఎండలు తీవ్రతరం అవుతున్నాయి. కార్బన్ డై ఆక్సైడ్ లక్షణం ఏమిటంటే అది వాతావరణంలోకి ప్రవేశించిన సూర్యకిరణాలను తిరిగి బయటకు పోకుండా నిరోధిస్తుంది దీనినే 'గ్రీన్ హౌస్ ఎఫెక్టు' అంటారు. దీని ఫలితం సహజంగా వాతావరణం మీద ఉంటుంది. దీనికి తార్కాణం గడచిన పదిహేను సంవత్సరాలుగా క్రమేపీ పెరుగుతున్న ఉష్ణోగ్రత. 1980 సం॥లో ఈ శతాబ్దంలో అత్యధిక ఉష్ణ సంవత్సరాలుగా చెప్పదగ్గవి నాలుగు ఉన్నాయి అలాగే 1980 సంవత్సరపు మొదటి నాలుగు నెలలు గత 140 సంవత్సరాలలో ఎన్నడూ కాయనంతటి ఎండల్ని చవిచూశాము వాతావరణంలోని ఉష్ణోగ్రత పెరగడంవల్ల ధృవ ప్రాంతాలలోని మంచు కరిగి సముద్రమట్టం బాగా పెరిగి అనేక తీర ప్రాంతాలు నీటిలో మునిగిపోతాయి అలాగే ఈ వేడిమివల్ల ప్రమాదకరమైన అల్ట్రావయొలెట్ రేడియేషన్ పెరిగిందంటూ ఉత్పత్తి కూడా పడిపోయి అనేక దేశాలు క్షామానికి గురిఅవుతాయి.

ఈ అనర్థాలన్నీ శాస్త్రజ్ఞులు ఎప్పటినుంచో గుర్తించినవే. అయితే అల్ట్రావయొలెట్ రేడియేషన్ పెరగడంవల్ల వరి పంట గణనీయంగా దెబ్బతినగలదని ప్రఖ్యాత వృక్ష శాస్త్రజ్ఞుడు డాక్టర్ అలాన్ తెరామురా భయాందోళనలను వ్యక్తం చేసి సమీపిస్తున్న సంక్షోభం గురించి హెచ్చరించాడు. అల్ట్రావయొలెట్ రేడియేషన్ కిరణజన్య సంయోగక్రియను దెబ్బలేని మొక్కలు తయారుచేసే పిండిపదార్థాల పరిమాణాన్ని దెబ్బతీయడం ఈ భయానికి కారణం. అలాగే వరి, సోయాబీన్ వంటి పంటలు నీటిని వినియోగించుకొనే తీరును కూడా ఈ ప్రభావం తారుమారు చేస్తుంది.

విచిత్ర మేమంటే అల్ట్రావయొలెట్ కిరణాల సమస్యవల్ల వరి పంట దెబ్బతింటుండగా ఈ వరే మరో విధంగా సమస్యను సృష్టిస్తుంది. వరిగడ్డిని కాల్చడం, ఎరువుగా మార్చడం వంటి వాటివల్ల విషపూరితమైన మిథేన్ వాయువు ఉత్పత్తి అయి వాతావరణంలో ప్రవేశిస్తుంది. డాక్టర్ తెరామురా అంచనా ప్రకారం ప్రపంచంలో ఉత్పత్తి, అయ్యే మిథేన్ వాయువులు పదిహేను శాతం వరి కారణంగానే అవుతోందట. జనాభా పెరుగుదలతోపాటు వరి ఉత్పత్తి, దానితోపాటు మిథేన్‌వాయువు ఉత్పత్తి కూడా ఎక్కువవుతూనే ఉన్నాయి ఒక్క కార్బన్ డై ఆక్సైడ్ మాలిక్యూల్ కంటే ఒక్క మిథేన్ వాయువు మాలిక్యూల్ పదివేలరెట్లు ఎక్కువగా వాతావరణాన్ని వేడిపరచగలదు ఈ పరిస్థితిని ఎదుర్కొనడానికి వరిమొక్కల జీవలక్షణాలని మార్చడం, అంటే జినెటిక్ ఇంజనీరింగ్ చేయడం ఒక్కటే మార్గమని డాక్టర్ తెరామురా అభిప్రాయ పడుతున్నారు. ఇలా చేస్తే సూర్యరశ్మి ప్రభావాన్ని తగ్గించే పైపుల వంటి రసాయనాలను ఈ మొక్కలు తయారుచేసుకోగలవు. ఫలితంగా రానున్న అనర్థాన్ని గణనీయంగా అరికట్టవచ్చు.

○

# బ్రహ్మదత్తుడు

-మల్లాప్రగడ శ్రీరంగారావు

అనఘుడను రాజునకు కుమారుడైన ఈ బ్రహ్మదత్తుడు అన్ని జంతువుల స్వరములు, వాని స్వభావములు వాటి ప్రవర్తనలు తెలిసినవాడు ఒకనాడు ఈ బ్రహ్మదత్తుడు సతీసమేతుడై అరణ్యములో విహరించుచుండగా కొన్ని జంతువుల అరపులు వినబడెను. వానిని విని బ్రహ్మదత్తుడు నవ్వెను. అతని భార్య ఏల నవ్వితిరి ? అని ప్రశ్నించెను. అతడు సమాధానము చెప్పలేదు తన్ను చూసి నవ్వెనను కోపముతో అతని భార్య కోపగించి, భర్తతో మాట్లాడుట మానివేసెను. అయినను బ్రహ్మదత్తుడు ఆమెయందాగ్రహింపక ఏడుదినములు విష్ణుమూర్తిని గూర్చి ప్రార్థించెను ఏడవనాటి రాత్రి కలలో విష్ణుమూర్తి కనబడి ఉదయమున మీ దగ్గరకువచ్చు బ్రాహ్మణులను కలుసుకొని వారిని సత్కరింపుమని పలికెను. తెల్లవారిన పిమ్మట బ్రహ్మదత్తుని సభలోకి ఒక బ్రాహ్మణుడు ప్రవేశించి ఓ రాజా ! మొదట బ్రాహ్మణ పుత్రులై, పిమ్మట సప్త వ్యాధులై, అటు పిమ్మట సప్తచక్రవాకములైన వారలు ఇపుడేమైరో ? అని కొన్ని శ్లోకములు పఠించెను బ్రహ్మదత్తుడు ఆ శ్లోకములను విని తన పూర్వజన్మ వృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొని కోరిన వరమిచ్చి వానిని సత్కరించెను ఆ బ్రాహ్మణునితోపాటు మరి యారుగురు అచటకు విచ్చేసిరి వీరందరు కౌశికుడను బ్రాహ్మణుని పుత్రులు. గర్గ మహర్షి శిష్యులు వీరందరూ ఒకనాడు అరణ్యములో తిరుగుచూ గురువు యొక్క ధేనువులు మేపుచుండగా తీవ్రమైన ఆకలిచే బాధపడి ఆ గోవును చంపి భుజించి వ్యాఘ్రమొకటి వచ్చి ఆ గోవును చంపెనని గురువైన గర్గమహర్షికి చెప్పిరి. ఆ పాప కృత్యముచే వారందరు వ్యాధులై పుట్టిరి. పితృదేవతలకు అర్పణ చేయుటచే వారికి పూర్వ స్మృతి కలిగెను. తరువాతి జన్మలో వారే చక్రవాకములైరి. ఆ ఏడుగురిలో ఒకడు రాజుకాగోరెను. అట్లు సంకల్పించిన వ్యక్తియే ఈ బ్రహ్మదత్తుడుగా జన్మించెను. వారిలో ఇద్దరు మంత్రులుకాగోరిరి. అట్లే వారిరువురు బ్రహ్మదత్తునికి మంత్రులైరి. మిగిలిన నలుగురూ ఆ పట్టణమందే బ్రాహ్మణులుగా పుట్టి తపస్సుచేసి తమ తపశ్శక్తిని లోకక్షేమమునకై వినియోగించిరి. ఈ వృత్తాంతమంతయు జంతువుల స్వరము విన్న బ్రహ్మదత్తునకు స్మృతికి వచ్చినను ఈ విషయములు భార్యకు చెప్పుటకు ఇష్టములేక మౌనము వహించెను అందులోని అంతర్యమును గ్రహింపక ఆమె సంభాషించుట మానివేసినను అతడు ఆగ్రహింపలేదు బ్రహ్మదత్తుడు ప్రశాంతచిత్తుడై పూర్వ పర జన్మల వృత్తాంతములను వారి విశేషములను తలచుకొని అప్పుడప్పుడు నవ్వుకొనుచూ కాలము గడుపుచుండగా కొన్నాళ్ళకు భార్య కోపమును మాని బ్రహ్మదత్తుని సమీపించి తన అజ్ఞానమును, అహంకారమును క్షమింపుమని ప్రార్థించెను. అపుడు బ్రహ్మదత్తుడు జంతువుల స్వరములలోని భావములను, వాటి స్వభావములను భార్యకు వివరించి చెప్పి ఈ రహస్యములను ఎవ్వరికిని వెల్లడి చేయకుము. అట్లు చేసినచో పిశాచత్వము సంభవించునని హెచ్చరించెను.

ఒకనాడు బ్రహ్మదత్తుని భార్య చెలులతో విహరించుచుండగా ఉద్యానవనమున కొన్ని పక్షులు పెంపుడు జంతువులు చిత్ర విచిత్ర వాదములు చేయుచుండగా

ఆమెకు నవ్వు వచ్చెను ఆ నవ్వునకు కారణము ఏమని చెలికత్తెలు ప్రశ్నించగా ఆమె మారు పలుకలేదు. ఏమ రహస్యమేదో ఆమె దాచియుంచెనని భావించి బలవంతము చేసి నీవు చెప్పనిచో మేము ప్రాణత్యాగము చేయుదమని వారందరును పలికిరి వారి యందున్న మమకారముతో బ్రహ్మదత్తుని భార్య భర్త చెప్పిన హెచ్చరికను లక్ష్యము చెయ్యక ఆ రహస్యమును చెలులకు చెప్పి పిశాచి అయ్యెను.

బ్రహ్మదత్తుడు ఈ విషయమును తెలిసికొని ధర్మము తప్పినవారికి ప్రాణగండము తప్పదు అని నిశ్చయించుకొని నాటి నుండి తనకు కలిగిన ఈ విజ్ఞానమంతటినీ విస్మరించుటకై ఏకాంత ప్రదేశమునకేగి తీవ్ర వైరాగ్యముతో తపస్సు చేసికొని జీవితము చాలించెను.

మత్స్యపురాణములోని ఈ గాథ వలన అమోఘమైన శక్తిని దుర్వినియోగము చేయరాదని, చేసినవారికి శిక్ష తప్పదని మనము గ్రహింపవలయును. ○



# చైనాలో హిందూ దేవాలయం

క్రీ. శ. పది పదకొండు శతాబ్దాల కాలంలో చైనాలో హిందూ దేవాలయాలున్నట్లు భూగర్భ పరిశోధనలలో వెల్లడైంది. దక్షిణ చైనాలోని సముద్రతీర పట్టణమైన క్యాన్‌జేలో శైవ, విష్ణు దేవాలయాలున్నట్లు కనుగొన్నారు. ఒక ఏనుగు అభిషేకం చేస్తున్నట్లు శివలింగం వివిధ భంగిమలలో విష్ణుమూర్తి విగ్రహాలు లభించినట్లు పురాతన వస్తు శాస్త్రజ్ఞులు తెలిపారు. బీజింగ్‌లో శ్రీకృష్ణ దేవాలయం, ఈశాన్య చైనాలోని తియాన్‌జిన్‌లో మరో శివాలయం ఉన్నట్లు వెల్లడైంది. షాన్‌మైకు దగ్గరలో ఉన్న ఫయిషన్‌లో అక్కడి పౌరులు హిందూ సంప్రదాయ రీతులలో ప్రార్థనలు జరిపేవారట. బీజింగ్‌లో సూర్య దేవాలయంకూడా ఉన్నది. చోళుల కాలంలో దక్షిణ భారతదేశ వర్తకులు వ్యాపార నిమిత్తం క్యాన్‌జేకు వెళ్లేవారని, వారి ప్రార్థనల నిమిత్తం దేవాలయాలు నిర్మించి ఉండవచ్చుననే అభిప్రాయం ఒకటి ఉన్నది. ఏది ఏమైనప్పటికి భారతీయ సంస్కృతి ప్రభావం చైనాకు కూడా ప్రాకింది. ○

# మనుష్యుల మనస్సులను మంచిగా

## ప్రతిదిద్దగల శ్రీ సాయిబాబా

-సర్ ఐజాక్ ప్లైగేట్

[సర్ ఐజాక్ ప్లైగేట్ తన అనుభవాలను వివరిస్తున్న వ్యాసం మొదటి భాగము జనవరి '95 దశాబ్ది ప్రత్యేక సంచికలో ముద్రించబడింది. రెండవ భాగమును ఈ సంచికలో పాఠకులకు అందిస్తున్నాము. "యునైటెడ్ కింగ్‌డం" అనే విదేశీ పత్రికలో ముద్రించబడిన వ్యాసమును అనువదించి శ్రీవాణికి పంపినవారు శ్రీ యస్. బి. యస్. రామారావుగారు. వారికి కృతజ్ఞతాభివందనములు.]

— సం॥

నా రెస్టారెంటులో సీటు దొరకాలంటే వచ్చిన వ్యక్తి సుమారు ఒక గంటసేపైనా బయట వేచి వుండవలసివస్తోంది. ఇలా బయట వేచివున్న వారికి ద్వారం గుండా లోపల పెద్దపైజు " సాయిబాబా " వారి ఫొటో కనిపిస్తూండేది.

చాలామంది ఇలా వేచివున్నంతసేపూ స్వామి దర్శనం వారికి లభిస్తుందనే విషయం తెలియక, నేను నా రెస్టారెంటులో మాంసాహారం విక్రయించటం వలన నన్ను అపార్థం చేసికొనేవారు. వచ్చిన వారిలో పదిమంది కొకరు నన్ను ఈ సాయిబాబా ఎవరని ప్రశ్నించేవారు. వారడగడం తడవుగా నేను వారికి సాయిబాబా వారిని గురించి చెబుతూనే వుండేవాడిని. గత 12 సం॥రాలుగ వారానికి పదివేలమందికి పైగా జనం నిత్యం నా రెస్టారెంటుకు వస్తూనేఉండేవారు ఇదంతా సాయిబాబా వారి అనుగ్రహమే అని నేనువారికి బోధిస్తూవుండేవాడిని. ఎంతోమంది అమెరికన్లు వస్తూవుండేవారు. నేను కూడా అమెరికను అవడంచేత వారికి నా రెస్టారెంటు అంతా చూపించి, ఇద్దరు ముగ్గురు అమెరికన్లతో కలసి నేను అప్పుడప్పుడు ఇతర 'క్లబ్' లకు (Clubs) కూడా వెళ్లి పిచ్చాపాటి మాట్లాడుకొంటూ చాలాసేపు గడుపుతూ వుండేవాడిని

అలా ఒకరోజు కొన్ని ఇతర పబ్‌లకు (క్లబ్) వెళ్ళి గడిపి రాత్రి 2 గం॥ లకు ఇల్లుచేరి, పర్సులోని విభూతి (కుంకుమ) పొట్లం తీసి పూజాగదిలో పెడదామని పర్సుకై జేబులో చెయ్యి పెట్టేసరికి జేబు ఖాళీ పర్సు లేదు. 1974 వ సం॥ నుంచి దీనిని నేను జాగ్రత్తగా వుంచుతూ రాత్రిళ్లు పూజాగదిలో పెడుతూ కాపాడు కొంటున్నాను. 1977 వ సం॥ లో ఇది ఇలాపోయింది. నేను చాలా దిగ్భ్రాంతి చెందాను. ఎంతో విచారించాను. నేనా ముందు గడిపిన 'పబ్' కి వెళ్ళి మేనేజరు, యజమానిని లేపి అర్ధరాత్రి నా పర్సు వెతకమని ఆజ్ఞాపించాను. నేను చాలా ధనవంతుడినగుటచే వారు కాదనకుండా వెతికారు కానీ అది దొరకలేదు. అపుడు నేను, అంతకు ముందు తిరిగిన పార్కులూ, బజారులూ సర్వం వెతికాను కానీ నా పర్సు దొరకలేదు. ధనం కంటె పర్సులో దాచిన 'విభూతి' కోసం నేను చాలా విచారించి దిగజారిపోయాను.

నా స్నేహితురాలొకామె, 'ఫిల్లిస్ క్రిస్టలు' కి ఈ విషయం తెలియపరిస్తే ఆమె సాయిబాబావారిని ధ్యానం ద్వారా అడిగి తెలిసికొని జవాబు చెప్పగలరని, పర్సు ఎక్కడ పడిపోయినదీ తెలుస్తుందనీ సలహా నొసగినది

'లాస్ ఏంజిల్సు' లో ఉదయం 5 గం॥ లకు 'ఫిల్లీస్ క్రిష్టలు' ఇంటికి ఫోను చేసి నేనీ విషయం తెలియ పరచాను. ఆమె ప్రయత్నిస్తానన్నది.

నేనారోజు బద్దకంగా పడుకొని, మధ్యాహ్నం రెండు గంటలకు "రాక్‌హార్డుకేఫ్" చేరాను. నా రెస్టారెంట్‌లో సర్వుచేసే ఒక 'ఐరిష్ యువతి' నాకీ అద్భుత విషయం చెప్పింది. ఆ రోజు మధ్యాహ్న సమయంలో ఇద్దరు యువతీ యువకులు వచ్చి ఒక కప్పు కాఫీ అడిగారట. భోజన సమయంలో "వెయిట్రెస్" కాఫీ కానీ టీ కాని సర్వు చెయ్యదు. అందులోనూ ఆమె చాలా బిజినెస్ దిట్టయైన యువతి ఏమాత్రం ఇష్టం లేకుండానే ఆమె వారిని కాదనలేక కాఫీ ఇచ్చిందట. వారు వెళ్ళిపోయాక ఏమైనా 'టిప్పు' వేసారేమో చూద్దామని టేబులు దగ్గరకు వెడితే అచట టిప్పుకు బదులు నా పోయిన పర్సు ఉన్నదట ఇలా అంటూ నా చేతికి ఆ పర్సు అందజేసింది.

నేను వెంటనే 'ఫిల్లీస్ క్రిష్టలు' కు ఫోను చేసి, ఆమె చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలిపాను. ఆమె 'నేనేమీ చేయలేదు. నీ పర్సు విభూతి పేకెట్టుతో సహా దొరకాలని సాయిబాబావారిని ప్రార్థించాను అంతే అది దొరుకుట సాయిబాబావారి కృపయే' అని చెప్పి ఆమె ఫోను పెట్టేసింది. ఆ కృప విభూతి రూపంలో నాకు మళ్ళీ లభించింది. నాకు చాలా సంతోషం కలిగింది.

1974 సం॥ నుండీ, ప్రతి సంవత్సరం నేను భారత దేశం వచ్చి సాయిబాబావారిని దర్శిస్తూనే వున్నాను. స్వామి ఏమీ మాట్లాడకపోయినాసరే వరుసగా 16సం॥లు స్వామి దర్శనానికి వస్తూనే వున్నాను. ఒకసారి నేనో యువతికి సహాయము చేయదలచి, సాయిబాబావారి కృపకు ఆమెను పాత్రురాలిని చెయ్యాలని చేసిన ప్రయత్నా న్నిప్పుడు వివరిస్తాను :

1976 వ సం॥లో నేను శివరాత్రికి బాబావారిని దర్శించడానికై ఇండియా బయలుదేరుతున్నాను ఒక రోజు ముందుగా ఏనో కారణంపై ఒక స్నేహితుడి వత్తిడి వలన ఆ రాత్రి క్లబ్బుకి వెళ్ళవలసివచ్చినది. అక్కడొక అందమైన యువతి, టేబులుపై కూర్చుని తల వంచుకొని గంజాయి పొగ పీలుస్తూ కనబడింది. నేనామె ప్రక్కనుండే ఎదరకు వెళ్ళాను. కానీ ఆమె తల ఎత్తలేదు. రెండడుగులు వెళ్ళాక, వన్నెవరో పట్టుకుని వెనక్కి త్రిప్పినట్లయింది. నేనామెకేసి చూసి ఇలా అన్నాను : "నా పేరు ఐజాక్ టైగ్రెట్. హార్డు రాక్ కేఫ్ యజమానిని. రేపు ఇండియా వెళ్ళుచున్నాను నేను నిన్ను ఇండియా తీసికొనివెళ్ళదలచాను' అని నేను ఎదరకు వెళ్ళిపోయాను. నేనామెతో ఆలా మాట్లా డాను కానీ, అది నా వాక్కు కాదనిపించింది. నా నోటి నుండి ఎందుకో ఆలా మాటలు నాకు తెలియకుండానే వెలువడ్డాయి. ఏ మాత్రం ఎరుగని ఆమెతో నేనలా ఎందుకన్నానో ఏమో, మరి కొద్దిసేపట్లో నేనచటనుంచి ఇంటికి వెళ్ళిపోయాను. నాకీ అనుభవం వింతగా తోచింది.

మరునాడు ఉదయం, నేను ఆఫీసుకి వెళ్ళగానే నా సెక్రటరీ, నన్ను ఎయిర్‌పోర్టులో దింపడానికి నా కారు సిద్ధంగా ఉన్నదని చెప్పింది. నేను నా లగేజి తీసికొని కారును చేరేటప్పటికి - నిన్న రాత్రి కనిపించిన యువతి చేతితో సంచి పట్టుకొని, కారు ప్రక్కన నిలుచుని ఉన్నది. నేనామెను చూడగానే గుర్తుపట్టి, వెనుకకు వెళ్ళి నా సెక్రటరీతో మరొక విమాన టిక్కెట్టు ఇండియాకు నాతోబాటు ఫోనుద్వారా బుక్ చెయ్య మన్నాను. మేమిద్దరం, కారెక్కి ఎయిర్‌పోర్టుకి వెళ్ళి ఇండియాకు ఎగిరిపోయాము. నాతో ఆమె, తానొక వ్యభిచారిణినని, హార్డురాక్ కేఫ్ చుట్టుప్రక్కలే ఆమె నివసిస్తూండడంవలన నా రెస్టారెంటు తనకు తెలుసు నని, ఆమె చెప్పింది. తాను గంజాయి పీల్చడానికి అలవాటుపడిందనీ, తనవాళ్లెవరూ లేరనీ తెలియబర చింది. మేము ఢిల్లీలో దిగేసరికి ఆమెకు అనారోగ్యం చేసినట్టు గ్రహించాను. ఆమెను ఢిల్లీలో ఒక వారం రోజులు, ఆరోగ్యం చేకూరేదాకా పోషించి, ఆమెకు అవసరమైనవన్నీ కొని ఇచ్చాను. ఆ తరువాత మన

మొక గురువును దర్శించడానికి వెళ్ళుచున్నామని చెప్పి పుట్టపర్తి ప్రవేశించాము సరిగా శివరాత్రికి పది రోజులు ముందుగా పుట్టపర్తి చేరాము ఆశ్రమ క్రమశిక్షణ ప్రకారము మసిలాము

స్వామి ఈమెపై చాలా కరుణ, ప్రేమ చూపించడం నన్ను చాలా ఆశ్చర్యపరచింది. ఎవరికీ చూపించనంత శ్రద్ధ స్వామి ఈమె ఎడల చూపినట్లు గ్రహించాను. ఆమె స్వామికి ఎప్పుడైనా ఉత్తరం ఇవ్వాలని పట్టు కొంటే చాలామందని తప్పించుకొని మధ్యకు వచ్చి స్వామి ఆమె ఉత్తరాన్ని తీసికొనేవారు. ఆమెను ఎదర వరుసకు వచ్చి కూర్చోమని చాలాసార్లు కూర్చో బెట్టారు స్వామి ఆమెను చూసి చిరునవ్వుతో ఆమెను వీపుపై తట్టి అభయం ఇచ్చేవారు.

శివరాత్రినాడు రాత్రి స్వామి లింగోద్భవం చేసారు. స్త్రీలకు ఒకవైపు మూలగా ఈమె కూర్చున్నది. స్వామి వారి మధ్యకు వచ్చి లింగమును అందరికీ చూపించుటకు వీలుగా వారు వరుసలమధ్య ఖాళీ ఏర్పఱచారు.

స్వామి శివలింగమును ఈమెకేసి చూపిస్తూ చేతితో పట్టుకొన్నారు. అపుడామె ఒక విధమైన ట్రాన్సులోకి వెళ్ళినట్లవగానే స్వామి కదలివెళ్ళారు. ఆమె, అప స్మారక స్థితిలో కొంత సంస్కృతము, కొన్ని ఇతర ప్రాచీన భాషలూ మాట్లాడినదట. ఆమెను నలుగురు స్త్రీలు మోసికొనివెళ్ళి పూర్ణచంద్రహాలు బయట కూర్చో బెట్టారు. ఆమె రెండు గంటలసేపు స్పృహ లేకుండా బయట నేలపై పడుకొని, నోటినుంచి నురగ గ్రక్కుచూ ఆ తరువాత స్పృహ వచ్చాక తన బరువంతా తగ్గి పోయి, జీవితం తేలికపడ్డట్టుగా భావించింది. తానిప్పుడొక కొత్త వ్యక్తినని చెప్పింది. బహుశా స్వామి ఆమె కర్మనంతనూ తొలగించివేశారేమో అనుకున్నాను నేను ఆ తరువాత ఆమె ఎచటికో వెళ్ళిపోయింది ఇక నాకు తిరిగి కనపడలేదు.

స్వామి ద్వారా ఆమెను బాగుచేయగల్గినందులకు నాకు చాలా సంతోషం కలిగింది.

కానీ స్వామి మాత్రం నాతో మాట్లాడలేదు. 1974 వ సం॥ నుంచీ ఇలా స్వామి దగ్గరకు వరుసగా, ఏటేటా వచ్చి, నెల రోజులు గడిపి వెళ్ళుచుండేవాడిని. 8, 9, 10, 15 ఏళ్ళు గడిచాయి కానీ స్వామి నాతో మాట్లాడ లేదు. వ్యాపారంలో నా రెస్టారెంట్ విపరీతమైన లాభాలు గడిస్తోంది. అప్పుడప్పుడు స్వామి కలలో కనిపించి ఈ రాక్ హార్డు కేఫ్ తనదని చెపుతూండేవారు. ఈ రాక్‌హార్డు కేఫ్ నా జీవితానికే ఒక పాఠం నేర్పింది. నా జీవితంలో నేను చాలా బంధువుల చావులు చూసాను. నా చిన్న తమ్ముడు చనిపోవుట చూశాక, నా వయసు 13 ఏళ్ల-22 ఏళ్ళ మధ్య నేను ఆలోచనలతో క్రుంగి ఎక్కువగా మాట్లాడేవాడిని కాదు. నా రెస్టారెంటులో సీటు కావాలంటే గంటసేపైనా జనం బయట వేచి వుండే వారు. వారానికి 10 వేలమందికి తక్కువ కాకుండా 12 ఏళ్ళపాటు నా రెస్టారెంటు చాలా బిజీగా నడిచింది. కనీసం వందమందికి పైగా వర్కర్సు నా దగ్గర రెస్టారెంటులో పనిచేసేవాళ్ళుండేవారు. 25 వేర్వేరు దేశాలనుంచి వీరిని సెలక్టుచేసి నియమించాను. నా వర్కర్సు 100 మందికీ కూడా ఎవ్వరూ ఇవ్వనంత ఎక్కువ డబ్బు ఇచ్చి నియమించి వారి ప్రతిభ కనబరచ మనేవాడిని వారందరికీ చాలా ఆత్మగౌరవం ఇచ్చి వారిని చాలా గౌరవంగా చూసేవాడిని. వారి మంచి చెడ్డలు ప్రతి రోజూ గమనించేవాడిని. వారికి కావలసిన అవసరాలు, మంచిచెడ్డలు అడిగి తెలిసికొని కార్లు, డబ్బు కూడా వారికి ఇచ్చేవాడిని ఈ వందమందినీ నా సొంత కుటుంబంలా చూశాను.

1989 వ సం॥ లో స్వామి బెంగుళూరులో ఒక డాక్టర్ల సమావేశం జరిగినప్పుడు నేను స్వామిని దర్శించ డానికి వచ్చి వారి సమావేశంలో వెనకగా కూర్చున్నాను. స్వామి 1974 నుంచీ, నాతో ఎప్పుడూ మాట్లాడనివారు నన్ను చూసి, ఎదరకు పిలిచి, నన్ను వారికి పరిచయం చేస్తూ, నేనితన్ని రెండుసార్లు ప్రాణ ప్రమాదం నుంచి రక్షించాను; అని అంటూ నా చెవిలో స్వామి, 'నిన్నింకా ఎన్నో సార్లు రక్షించాను కదూ!' అని నెమ్మదిగా

అన్నారు. అవును స్వామీ ! అన్నాను 'ఇటువంటివారిని రక్షించడానికి ఒక సూపరు స్పెషాలిటీస్ హాస్పటలు అవసరం అని స్థాపించబోతున్నాను' అని డాక్టర్లతో చెప్పి, నన్ను వెళ్ళి కూర్చోమన్నారు.



నేను తిరిగి లండన్ వెళ్ళిపోయాక నాకు గుండె నీరసం వచ్చింది. స్వామిని ప్రార్థించాను. కొంత సేపు ధ్యానం చేశాను ఆ ధ్యానంలో స్వామి ఎవరో క్రొత్త వ్యక్తిని పరిచయం చేసారు. మరి రెండుమూడు రోజులకు ఆ వ్యక్తి నన్ను చేరి నీ హార్డు రాక్ కేఫ్ అమ్మేస్తావా ? నీవు అడిగినంత ధనం ఇస్తానన్నాడు. 108 మిలియన్ల డాలర్లు ఇస్తావా అని అడిగాను. ఆ వ్యక్తి ఇస్తానన్నాడు నా రెస్టారెంట్ అమ్మివేసి అందుండి కొన్ని కోట్ల రూపాయల ధనం తీసికొనివచ్చి నా స్వామికి శ్రీ సత్యసాయి బాబావారికి సమర్పించి, మీరు తలపెట్టిన సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటలును రూపకల్పనచేసి, ఈ ధనాన్ని ప్రజా సహాయానికి ఉపయోగించమని స్వామి పాదాలు పట్టుకొని ఈ ధనం స్వీకరించ వలసినదిగా ప్రాధేయపడ్డాను. స్వామి నన్ననుగ్రహించారు. నా జీవిత పరమావధి నెరవేరింది.

స్వామి నన్ను "దేవుడెక్కడున్నాడు" అని ప్రశ్నించారు స్వామీ నాకు తెలియదు, మీరే చెప్పండి, అన్నాను. 'సముద్రంలో ఈదే చేప చుట్టూ నీరున్నట్లు చేప పొట్టలో కూడా నీరున్నట్లు, నీ లోపల, నీ బయటా భగవంతుడు ( అంతఃబహిశ్చ స్సర్వం - వ్యాప్య నారాయణ స్థితః ) సర్వత్రా వున్నాడని వివరించారు. అయితే భగవంతుడుని, నేనెలా చేరుకోగలను స్వామీ ? అని ప్రశ్నించాను. 'అందరినీ ప్రేమించు - సర్వులను సేవించు' నా ద్వారా నీవు ఈ ప్రేమను ( సూపర్ స్పెషాలిటీస్ హాస్పటలు ద్వారా ) అందరికీ అందించుచున్నావు కదా ! సేవను మించిన ఆనందం లేదు. 'త్యాగేనైక అమృతత్వ మానసుః' నీ సర్వస్వం త్యాగం చేసి అమృతత్వమును పొందుతున్నావు' అని నన్ను స్వామి ఆశీర్వదించారు నా ప్రవర్తనను - మనసును తీర్చిదిద్దిన శిల్పి శ్రీ సాయిబాబా.

)○(

## మహితమూర్తి !

-బీరం భాగ్యలక్ష్మి

పుట్టపర్తి నిలయుడై ప్రోజ్వలకాంతులు
విరజిమ్ముచుండెడు వేదమూర్తి
కోరివచ్చినవారి కొంగు బంగారమై
ఆర్తి పోగొట్టెడు అభయమూర్తి
తన వాక్కు జగతికి తన్మయమొదవింప
ఆశీస్సులందించు అమృతమూర్తి
కఠినచిత్తులకైన కర్తవ్యమెరిగించి
దైవచింతన నేర్పు ధర్మమూర్తి
దయకు తావైన ప్రేమావతారమూర్తి
సత్యనిరతికి నెలవైన సగుణవర్తి
మానవాకృతి నొప్పెడు మహితమూర్తి
సకల శుభముల నొసగెడు సాధుమూర్తి !

# కంటిచూపునిచ్చే కరుణామయుడు

-ఆర్. ఎస్. కె. మూర్తి

సుప్రసిద్ధ నేత్ర వైద్యులు డాక్టరు మోడి పేరు నేటి మన యువతీ యువకుల్లో ఎక్కువమంది విని ఉండరేమో ? ఎందుకంటే ఆయనొక సినిమా నటుడు కాదు క్రికెట్ హీరో కాదు. కనీసమొక రాజకీయ నాయకుడన్నా కాదు. కర్నాటక రాష్ట్రంలోని దేవణగిరిలో సుమారొక 75 సంవత్సరాలకు పూర్వం జన్మించిన వారాయన. వృత్తిచేత కంటి డాక్టరు. ప్రవృత్తిచేత సేవానిరతుడు – డాక్టరు మోడి.

గుడ్డివారిలో రెండు మూడు రకాల వాళ్ళుంటారు. ఒకరు పుట్టంధులు. అనేక కారణాలవల్ల కొందరికి పుట్టుకతోనే కంటి చూపు ఉండదు. వీరికి కంటి చూపు తెప్పించడం కష్టసాధ్యమైనపని. మరో మనిషి కంటి గుడ్డును తెచ్చి వీరికి అమర్చాలి అందుకు నేత్రదానం చేసేవారు కావాలి. అట్లా దానం చేసిన వారి కనుగుడ్లను వారు మరణించిన ఆరుగంటలలోగా తొలగించాలి. జాగ్రత్త చేయాలి, మరో కంటికి అమర్చాలి. ఇదంతా ఎంతో కష్టంతో కూడిన వైద్య శాస్త్ర ప్రక్రియ.

మరో రకం గ్రుడ్డివారుంటారు. పుట్టుకతోనేకాక పోయినా వీరు శాశ్వత అంధులేఅయిపోతారు. మశూచికం వంటి వ్యాధులవల్ల కారు రైలు వంటి ప్రమాదాలలో ఇతరత్రా కొన్ని కారణాలవల్ల. మిల్టను అనే ఇంగ్లీషు మహాకవి తన నలభైయవ ఏటశాశ్వతంగా అంధుడై పోయాడు అందుకాయన విలపిస్తూ ఒక పద్యంవ్రాశాడు కంటి చూపు పోయినందువల్లనే సినిమాలు చూడలేక పోయానని టి. వి.లో క్రికెట్ మ్యాచ్‌లు తిలకించలేక లేకపోయానని ఆయన వేదన చెందలేదు భగవానుడు తనకిచ్చిన కవితాపాటవంతో భగవంతునిపై కవితల్లి, ఆయన కీర్తి గానం చేయలేకపోయానని దుఃఖిస్తాడు – మిల్టన్ మహాకవి ఇట్లా కంటి చూపు పోగొట్టుకొని దురపిల్లేవారు, రెండోరకం గ్రుడ్డివారు. వీరికి కూడా కనుగుడ్డు మార్పిడి ద్వారా మాత్రమే చూపు పునరుద్ధరింపబడుతుంది.

ఇక మూడో రకం అంధులుంటారు. వీరి అంధత్వం తాత్కాలికం. కంటికి వచ్చే రోగాల కారణంగా వీరికి చూపు తగ్గిపోతూవస్తుంది. చివరకు పూర్తిగా గుడ్డివారవుతుంటారు. ఇట్లు అంధత్వాన్ని తెచ్చే వ్యాధులలో ప్రధానమైనట్టిది – శుక్లాల వ్యాధి. ఇంగ్లీషులో క్యాట్రాక్ట్ అంటారు. కనుపాపమీద తెల్లటి పల్చటి పొర ఏర్పడడంతో దృష్టి పోతుంది వ్యాధి పీడితులకు. ప్రపంచమంతటా ఉన్నదే అయినా – ఈ వ్యాధి మన దేశంలో మరీ ఎక్కువ. ఒక ఐదు పదేళ్ళ క్రిందటి లెక్కల ప్రకారం మన దేశంలో ఇట్లాంటి అంధులు ఒక యిరవై అయిదు లక్షలమంది. ప్రపంచంలోని నలుగురి గుడ్డివారిలో ఒకరు మన దేశంలోనే ఉన్నారట. దీనికి కారణం ఇక్కడ ఎండ తీవ్రంగా ఉండటం .... దుమ్ము ధూళీ ఎక్కువగా ఉండటం .... పౌష్టికాహార లోపం వంటి వాటిని పేర్కొంటారు. అన్నిటినిమించిన కారణం వైద్య సహాయం అందుబాటులో ఉండక పోవటమేననుకోండి.

ఆపరేషనుచేసి శుక్లాలను తొలగించి, కంటిచూపును రప్పించవచ్చు, ఇది మేజర్ ఆపరేషన్ కూడా కాదు, తేలికగా చేయగల ఆపరేషన్. అయితే ప్రస్తుత పరిస్థితులలో కొన్ని వేల రూపాయలు ఖర్చయ్యే వైద్యం యిది.

డాక్టరు మోడి గొప్పతనమేమిటంటే— గత నలభై సంవత్సరాలుగా ఆయనీ శుక్లాల ఆపరేషన్లను ఉచితం గానే చేస్తున్నారు. ఇప్పటికాయన రెండు లక్షలకు పైగా అభాగ్యులకు దృష్టి దానం చేశారు. అంటే కొన్ని కోట్ల రూపాయల ఆదాయాన్ని ఆయన వద్దనుకున్నా రన్న మాట అన్ని కోట్లు, ఇన్ని లక్షలు.... ఆ కుంభకోణంలో, ఈ కాంట్రాక్టుల్లో పొందారన్న వారు— నేడు మనకు నాయకులై మన వేదాలను గురించి, శాస్త్రీయ విజ్ఞానాన్ని గురించి వేదికలెక్కి ఉపన్యాసాలు యిస్తున్నారు గదా! అట్లాంటి వాళ్ళందరి పేర్లు మనలో చాలామందికి తెలుసు కోట్లకొలది నల్లధనం గడించే వెండితెర వారైతే మన యువత కసలు ఆరాధ్యదైవాలే కదా! అయితే డాక్టరు మోడి ప్రసక్తి ఎవరికి కావాలి?

ఉచితంగా మాత్రమే కాదు, నేర్పుతో, ఓర్పుతో, ప్రేమతో వేలాదిగా కంటి ఆపరేషన్లు చేస్తుంటారు డా॥ మోడి. గ్రామాలలో ఉండే వేలాదిమంది అంధులు తన దగ్గరకు రాలేరని.... తానే వారి దగ్గరకు వెళ్లుం టారు. అవసరమైన బలగంతో, మందులతో ఆయనే ఒక వూరినుంచి మరొక వూరికి పయనమై పోతుంటారు. ఏ స్కూలులోనో, కాలేజీలోనో ఒక పెద్ద గదినో, హాలునో ఆపరేషను థియేటరుగా రూపుమార్చేస్తారు. ఒక్కసారిగా పదిమందిని పది బల్లలమీద పడుకోబెడ తారు, వరుసనే ఒక్కొక్కరికి శుక్లాలు తొలగించి సాగి పోతుంటారు మోడి. పదిమంది తర్వాత మరో పదిమంది. ఇట్లా రోజుకో కొన్ని వందల మందికి ఆయన కంటిచూపును ప్రసాదిస్తారు. రెండు నిమిషాలకో ఆపరేషను చేస్తారాయన. ఒకరోజునైతే ఆయన 800కు పైగా ఆపరేషన్లు చేశారుట.

ఆపరేషను చేసిపారేసి, వారి కర్మాన వారిని వదలి పోరు మోడి వారం రోజులాయన అదే క్యాంపులో ఉంటారు ఎనిమిదవ రోజున కట్లువిప్పి, చౌకగా అందరికీ కళ్ళద్దాలు యిచ్చి, వారి నమస్కారాల నందు కుంటూ మరోచోటుకి సాగిపోతాడా దయామయుడు.

# విదురనీతి

" హితం యత్ సర్వభూతానాం
ఆత్మనశ్చ సుఖావహం
తత్ కుర్యాదీశ్వ రే హ్యే తత్
మూలం సర్వార్థ సిద్ధయే "

ఏది సమస్త ప్రాణులకు హితమైనదో, తనకున్నూ సుఖము నొసంగునట్టిదో, దానిని ఈశ్వరార్పణముగా చేయవలెను ఇదే సర్వార్థసిద్ధికి మార్గము.

డా॥ మోడి ఇప్పటికి రెండు లక్షలమందికి యిట్లా కంటిచూపును ప్రసాదించారు. మనదేశంలో 25 లక్షలమంది శుక్లాలవల్ల గ్రుడ్డితనం వచ్చినవారున్నారని చెప్పుతున్నారు గదా! మరో పన్నెండుమంది 'మోడీలు మన దేశంలో ఉద్భవిస్తే! దేశంలో అంధత్వం దాదాపుగా లేనట్లే అవుతుంది గదా! భయావహమైన అంధత్వం సంపూర్ణంగా తొలగిపోవటం ఎంతటి అందమైన ఊహ!

కాని, ఏరి మరో 12మంది 'మోడీలు' ఏరి? ఆయనంత నేర్పుతో, ఓర్పుతో, సేవానిరతితో దరిద్రనారాయణుని సేవించవచ్చేవారు ఏరి? ఎంతటి నేర్పరి అయిన డాక్టరైతే.... ఆయన వైద్యం అంత ఖరీదుగా ఉండటం కదా. నేటి లోకపు తీరు! అసలు డాక్టరంటేనే నాసిక్ ముద్రణాగారమని కదా— ఆయనకు పిల్లనిచ్చే అత్తా మామల పేరాశ! తల్లిదండ్రుల దురాశ!

అందరు డాక్టర్లూ యిట్లాగే ఉన్నారని కాదు. కొంద రైనా 'మోడిలు' లేరని కాదు. డా॥ శివారెడ్డి ప్రభృతు లున్నారు. సేవాసంస్థలు నిర్వహించే నేత్రచికిత్సా శిబిరాలలో సేవానిరతితో పాల్గొనే డాక్టర్లు చాలామందే ఉన్నారు, త్యాగభూమి కదా మనది త్యాగనిరతి పూర్తిగా స్వార్థానికి చోటిచ్చి అదృశ్యమైపోలేదు పుణ్యభూమిలో యింకా!

కాకపోతే.... త్యాగభావనకంటే స్వార్థభావనే కడు విరివిగా వ్యాపిస్తున్నది. నిర్మలకాసారంలో కలువల కంటే తీవ్రంగా, గుర్రపుడెక్కలఆకు పెరుగుతున్నది

ఉదాహరణకి అంధుల సమాచారమే తీసుకుందాం బొంబాయి, కలకత్తాల వంటి మహానగరాలలో బిచ్చగాళ్ళ రాకెటీర్లు ఉంటారు. దిక్కూమొక్కూ లేని బాలబాలికలను వీరు పట్టుకుపోతారు ఆ పసికళ్ళల్లో మందులు, ఆసిడ్లు పోసి వారిని శాశ్వత అంధులుగా మారుస్తారు. అట్టి అంధ బాలబాలికలు ముష్టెత్తి తెచ్చే డబ్బును ఈ పెద్దలు దోచుకుంటారు వాళ్ళకింత తిండి పడేస్తుంటారు. అంధులుగా మాత్రమే కాదు, కొందరిని వీరు కుంటి వారుగా కాళ్ళు చేతులు విరుగకొడతారు మరోరకంగా, మరోరకంగా వాళ్ళను దయనీయమైన బిచ్చగాళ్ళుగా మారుస్తారు. ఒకప్పుడెప్పుడో చదివిన గుర్తు. ఒక్క బొంబాయి మహానగరంలో ఈ బిచ్చగాళ్ళ సిండికేట్ల సమిష్టి సంపాదన నెలకు 15 లక్షల రూపాయలుంటుందని. అంటే, అమాయకపు పసివారల కళ్ళు, కాళ్ళతో వ్యాపారాలుచేసి అంత ధనం సంపాదించే కరకు కసాయి గుంపులున్నాయన్నమాట. మన దేశంలో !

మోడీలు పుట్టిన దేశంలోనే - ఈ కరకు కసాయిలు పుట్టారు. రెండు లక్షలమందికి ఒంటిచేత్తో కంటిదానం చేసిన మహనీయునితో పాటే ఈ గడ్డమీద వేలాదిమంది బాలబాలికల కంటి చూపును పరమ నిర్దాక్షిణ్యంగా హరించివేసిన క్రూర కర్ములూ జీవిస్తున్నారు.

అందరమూ మోడీగారి వంటి త్యాగభావనిరతులం కాకపోవచ్చు.

కాని మనమందరమూ ఆయనకు అభిముఖంగానన్నా ఉన్నామా? లేదా? ఆయన మార్గాన ఎంతముందుకు సాగి పోతామన్నది ప్రశ్నకాదు అసలా మార్గాన మనం పయనం ఆరంభించామా ? లేదా ? రాకెటీర్ల దోవ మనలను ఆకర్షిస్తున్నదా ? లేదా ?

మన యువతీ యువకులు - రేపటి డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, అధికారులుగా రూపొందుతున్న విద్యార్థినీ విద్యార్థులు - వారి ముందున్న ప్రశ్న !

బొంబాయి సిండికేట్లు మనకు ఆదర్శమా !

డాక్టరు మోడీనా మనకు ఆరాధ్యనీయుడు ? ఆలోచించండి. 

## శ్రీవాణి పోషకులు



శ్రీమతి లక్ష్మీ సామ్రాజ్యం
శ్రీ మామిడిబత్తుల దుర్గాప్రసాద్
మద్రాసు

## శ్రీవాణి జీవిత సభ్యులు



తోలేటి అచ్యుతరావు
శ్రీమతి తోలేటి సీతారామలక్ష్మి
M/s జయశ్రీ కెమికల్స్ లిమిటెడ్
), గంజాం జిల్లా, ఒరిస్సా

సంక్రాంతి సందేశము .... (3 వ పేజీ తరువాయి)

ద్ధముగా ఉండేవాడు భగవంతుడొక్కడే అతను క్కడున్నాడు ? వాసః అన్నారు. వాసః ఎక్కడ వసిస్తున్నావు ? అని అడిగినప్పుడు నేను ఫలానా పేటలో, ఫలానా ఇంటిలో నివసిస్తున్నానంటాడు గాని ఇవన్నీ నీ దేహము నివసించే స్థానములే కాని, నీవు నివసించే స్థానములు కావు. నీ దేహము ఆ నెంబరు ఇంట్లో నివసిస్తుండాలి ఆ దేహము ఆ ఫలానా గృహములో నివసిస్తుండాలి, కాని నీవెక్కడ నివసిస్తున్నావు? నీ నివాసమే ఆత్మనివాసము. అదియే ప్రేమస్వరూపము. అట్టి ప్రేమలో నీవు నివసించాలి. అట్టి ప్రేమలో నీయొక్క జీవితాన్ని గడపాలి. అట్టి ప్రేమలోనే నీయొక్క జీవితాన్ని అంకితం గావించాలి. దీనికి దానికి మనం అర్పితముచేసి ప్రయోజనంలేదు. అస్థిరమైన దానిని ఆశించినప్పుడు అస్థిరమే మనకు ఫలితంగా లభిస్తుంది. అశాశ్వతమైన దానిని మనం అనుసరించినప్పుడు అశాశ్వతమే మనకు ప్రాప్తిస్తుంది. శాశ్వతమైన దానిని మనం ఆశ్రయించాలి. శాశ్వతమైన దానిని మనం అనుసరించాలి. అదియే భగవంతుని యొక్క ఆజ్ఞ. అట్టి ఆజ్ఞను మనం అనుసరించినప్పుడు, అట్టి రాజమార్గమున మనం నడిచినప్పుడు మనం కోరినటువన్నీ సఫలమవుతాయి. ఏమిటి ఈ కోరికలు ? ఈ కోరికలు పెరిగిన కొలది మన బంధన అధికమౌతుంది. కోరికలు ఎంత తరిగితే మన బంధనలు అంత విముక్తి గాంచుతుంది. కనుక బంధనలకు మన కోరికలే మూలకారణం. కాని కోరికలు ఉండవలసినదే, దానికీ కొంత పరిమితముంటుండాలి. ఈ పరిమితాన్ని మనం మించిపోయినప్పుడు మనం బంధనంలో చిక్కుబడిపోతాం. కనుక మానవత్వములో ఉండిన దివ్యత్వానికి, మానవత్వములో ఉండిన దుఃఖమునకు మూలకారణమేమిటో మనం విచారించాలి. నిజముగా మన దుఃఖమునకు హేతువేమిటి ?

ఒక ఇంటిలో ఒక మృత్యువు సంభవించింది. అందరూ బాధపడుతున్నారు. ఈ బాధకు ఆ మృత్యువా కారణము ? కాదు....కాదు.... ఆ మరణించిన వ్యక్తిపైన ఉండిన అభిమానమే ఈ దుఃఖమునకు కారణము. మరణము కాదు దుఃఖమునకు కారణము. ఒక ఇంటిలో మరణించినప్పుడు ఆ ఇంటిలో వారు మాత్రమే దుఃఖిస్తారు. మరెవ్వరూ దుఃఖించరే ! దుఃఖమే మూలకారణమయితే అందరూ దుఃఖించాలి కదా! కాదు ! కాదు ! కాదు ! ఆ మరణించిన వ్యక్తిపైన ఉన్న అభిమానమే ఈ దుఃఖమునకు మూలకారణము కనుక మొట్ట మొదట ఈ అభిమానమును క్రమక్రమేణ మనం తగ్గించుకుంటూ రావాలి. దీనినే వేదాంత పరిభాషల యందు 'వైరాగ్యము' అని చెబుతూ వచ్చారు. ఈ బాధ్యతలను క్రమక్రమేణా తగ్గించుకుంటూ రావాలి. దీనినే "Less luggage more comfort make travel a pleasure." మన ప్రయాణము లోపల ఈ లగేజ్‌ను తగ్గించుకుంటూరావాలి. అయితే ఏవిధంగా తగ్గించుకోవాలి ? ఈ వాంఛలు లేకుండా మానవుడు జీవించడానికి వీలుకాదే ! ఈ వాంఛలు ఏ విధముగా మనము తగ్గించుకోవడానికి వీలవుతుంది ? వాంఛలు తగ్గించుకోవడమంటే వాంఛలపైనున్న మమత్వాన్ని తగ్గించుకోవడము. నీ వ్యాపారము నీవు చేసుకో, నీ ఉద్యోగానికి నీవు వెళ్ళు. నీ కర్తవ్యాలు నీవు నిర్వర్తించు, నీ బాధ్యతలు నీవు అనుసరించు, ఆచరించు, అనుష్ఠించు కాని ఇవన్నీ కూడనూ భగవత్ కార్యములే అనే భావనతో నీవు అనుభవించాలి "సర్వకర్మ భగవత్ ప్రీత్యార్థం" అనే భావనతో నీవు అనుభవించాలి. ఇది సులభమైన మార్గము. అన్నీ భగవంతుడే చేస్తున్నాడు. కన్నులు చూస్తున్నాయి, కాని కన్నులా చూచేది, కాదు, కాదు.... ఈ కన్నులలో ఉండే దివ్యశక్తియే ఈ కన్నుల ద్వారా చూస్తుండాలి చెవులా వింటున్నది ? కాదు, కాదు.... లోపల ఉన్న దివ్యశక్తియే చెవుల ద్వారా వింటున్నది. ఈ చెవులు కేవలం ఒక లౌడ్‌స్పీకర్స్, కన్నులు కేవలం ఒక బల్బ్ వంటివి. కాని లోపల ఈ కరంటే లేకపోతే చెవులు వినగలవా ? కన్నులు చూడగలవా ?

ఆ కరంటే శక్తి స్వరూపము, అదియే ఎనర్జీ. ఈనాడు మానవుడు లోపల మాత్రము అన్నీ నెగిటివ్ థాట్స్ ఉంచుకున్నాడు. అన్ని భావములు కూడనూ నెగిటీవులే. నెగిటివ్ థాట్స్ లోపల నింపుకొని పాజిటివ్ పైన మనం ప్రవేశిస్తే ఏ రీతిగా మనకు లభిస్తుంది ? కనుక మొట్ట మొదట మనలో ప్రవేశించిన దివ్యశక్తిని విశ్వసించాలి. నాస్తికుడైనా, ఆస్తికుడైన నాస్తిక యాస్తికుడైన ఈ శక్తిని విశ్వసించక జీవించే వ్యక్తి జగత్తులో లేదు ఈ శక్తికి అనేక పేర్లుపెట్టుకోవచ్చును. పేర్లు ప్రధానం కాదు, శక్తి ఒక్కటే. ఆ దివ్యశక్తియే మానవత్వాన్ని సరిఅయిన మార్గంలో ప్రవేశపెడుతుండాలి. కనుక మానవుడు ప్రతి విషయమునందు కూడనూ చిన్న చిన్న సూక్ష్మమైన మార్గములో ఈ దివ్యత్వాన్ని గుర్తించడానికి ప్రయత్నించాలి.

ఈనాడు సాయి సంస్థల గురించి అనేకవిధములుగా మన అనిల్‌కుమార్ చెప్పాడు. సంస్థలు జరుగుతున్నాయి భక్తిశ్రద్ధలతో చేస్తున్నారు. కాని లక్ష్యమేమిటో అనేటువంటి తత్త్వాన్ని గుర్తించడానికి వారు తగిన కృషి చేయడంలేదు నీ తృప్తి నిమిత్తమై ఆచరిస్తున్నావా ? లేక దైవతృప్తి నిమిత్తమై ఆచరిస్తున్నావా ? ఇదియే ఒకానొక సమయంలో ఒక భక్తుడు జీసస్‌వద్దకు వెళ్ళి 'స్వామి ! తనను తాను రక్షించుకొనగలుగు శక్తి ఏమిటి ? అన్నాడు. 'నాయనా ! నీవు భగవంతుణ్ణి ప్రేమించినప్పుడు ఆ శక్తే తనను తాను రక్షింపచేస్తుంది' అన్నాడు ఇదియే భగవద్గీత యందు కూడనూ 'స్వామి! భగవత్ ప్రేమకు పాత్రులు కావడానికి ఏమి చేయాలి?' అన్నాడు 'పిచ్చివాడా! నీవు భగవంతుడిని ప్రేమిస్తున్నానని భ్రమిస్తున్నావు భగవంతుడు నిన్ను ప్రేమించేటువంటి మార్గాన్ని వెతుకు' అన్నాడు. లోకంలో కోట్లా ప్రజలంతా కూడనూ భగవత్ అన్వేషణ జరుపుతున్నారు ఎక్కడ ఉన్నారని జరుపుతున్నారు అన్వేషణ ? నా ఉద్దేశ్యము 'భగవత్ అన్వేషణ' అన్న పదం చాలా తప్పు నీవు భగవంతుని వెతకనక్కరలేదు భగవంతుడు ఎక్కడ చూచినా ఉన్నాడు. కాని భక్తులు భగవంతుని వెతుకుతున్నామని భ్రమిస్తున్నారుకాని భక్తులు భగవంతుని వెతకటం లేదు, భగవంతుడే నిజమైన భక్తుడ్ని వెదుకుతున్నాడు. ఎక్కడ ఉన్నాడు ? త్రికరణ శుద్ధితో కూడిన భక్తుడు ఎక్కడ ఉన్నాడు ? అని తానే నిరంతరము కూడనూ ఇటువంటి భక్తుని వెదుకుతున్నాడు. భగవంతుని మీరు వెదుకనక్కరలేదు. తల్లిదండ్రులకంటే అతి సమీపుడై ఉంటున్నాడు భగవంతుడు. నీవే భగవంతుడై ఉంటున్నావు నిన్ను నీవు ఎక్కడ వెతుక్కోగలవు? ఇదియే పెద్ద పొరపాటు.

అంతా దైవస్వరూపమైనప్పుడు ఇంక దైవమును వెదికేవారెవరు? ఇలాంటి వేదాంతమనేది ప్రాచీనకాలము నుండి కూడనూ విపులంగా, ప్రజలకు పామరులకు వివరించేవారు లేకపోవటం చేతనే ఇన్ని విధములైన అగాధము లోపల మునిగి అస్తవ్యస్తమైన జీవితాన్ని గడుపుతున్నారు. భగవంతుని వెదుకనక్కర్లేదు. నీవే భగవంతుడవై ఉన్నావు. అలాంటి భగవంతునియొక్క తత్త్వాన్ని మొట్టమొదట నీవు గుర్తించటానికి తగిన ప్రయత్నం చేయి ! ఏ విధంగా చేయాలి ? ఒకటే మార్గము. ప్రతి మానవుడు కూడనూ దివ్యాత్మతో కూడిన ప్రేమస్వరూపునిగా విశ్వసించు అందరినీ ప్రేమించు ! అందరినీ సేవించు ! దీనినే The best way to Love God, is to Love all; Serve all. మనం అందరినీ ప్రేమించాలి. ఎందుకనగా ఆ రూపంలో ఉన్నాడు భగవంతుడు, ప్రతి మానవుని యొక్క స్వరూపము కూడనూ భగవంతుని యొక్క వేషమే. భగవంతుడు ధరించిన వేషము నీవనుకుంటున్నావు, మానవునిగా భ్రమిస్తున్నావు. ఈ లోక నాటకరంగమందు ఈ మానవుడు తనకు పెట్టిన పేరు, ఇచ్చిన రూపాన్ని ప్రకటిస్తున్నాడు. కాని తెచ్చిన రూపమేమిటో, పుట్టిన రూపమేమిటో తాను గుర్తించడానికి ప్రయత్నించటం లేదు.

మీరు నిన్న రాత్రి చూచారు అంజలీదేవి సక్కుబాయి వేషము వేసింది కాని అక్కడ సక్కుబాయిగా నాట్యమాడింది గాని, సక్కుబాయిగా act చేసిందిగాని, అంజలీదేవిగా చేయలేదు అయితే అంజలీదేవి, సక్కుబాయి రెండు ఒక్కటే. కాబట్టి మానవునియొక్క రూపమును

ధరించి ఈ విశ్వ నాటకరంగములోపల ఆ మానవాకారము చేత తన నాట్యము తాను జరుపుకుంటూ పోతున్నాడు కాని అతని యందున్నటువంటిది కూడనూ దైవమే. దైవమే ఆ రూపాన్ని ధరించాడు. ఈ విశ్వాసముతో మనం పోతుంటే ' బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి ' అనే భావము మనలో ఆవిర్భవిస్తుంది. నేను మానవుడు! మానవుడు ! మానవుడు అనుకుంటుంటే నీవు మానవుని గానే అవుతావు కాదు ! కాదు ! నేను దైవము, దైవము దైవమనే విశ్వాసముతో గాఢ విశ్వాసముతో నీవు స్మరిస్తే నీవు నిజంగా దైవమైపోతావు. కనుక మన భావములే దీనికి మూలకారణాలు. ఈ భావములు మార్చుకోవాలి జగత్తును చూస్తున్నాము. కాని ఎట్లా చూస్తున్నాము ? జగత్ భావన దృష్టితో చూస్తున్నాము. ఈ జగత్ భావన దృష్టిని దూరం చేసి విశ్వభావంతో చూడు నీవు విశ్వము, విష్ణువు రెండూ ఒక్కటై పోతాయి. దృష్టిని మార్చుకోవాలి మనం. కాని ఈనాటి మానవుడు తన దృష్టిని తాను మార్చుకొనక సృష్టిని మార్చడానికి ప్రయత్నిస్తున్నాడు. సృష్టిని మార్చడం ఎవ్వరి తరమూ కాదు మన దృష్టిని మార్చుకోవాలి. సర్వమూ మనకు ఏకంగా కన్పించాలంటే ఏకాత్మ భావమనే అద్దాలు మనం ధరించాలి అట్టి ఏకాత్మ భావమనే అద్దములు ధరించక, ప్రకృతికి భిన్నమైన అద్దములను మనం ధరించినప్పుడు జగత్తంతా భిన్న రూపకంగానే కనిపిస్తుంది. ఏమిటది ? రజోగుణమైన అద్దము తమోగుణమైన అద్దము, సాత్వికమైన అద్దము ఇలాంటి అద్దాలను మనం ధరిస్తున్నాము ఈ రజోగుణ తమోగుణ సాత్విక గుణాల అద్దములను ప్రక్కకు నెట్టి ఏకాత్మభావమనే అద్దములను ధరించు అనగా ప్రేమ ఒక్కటే రెండు లేవు " ఏకం సత్ విప్రా బహుధా వదంతి " దీనిని అనేకమంది, అనేక పేర్లతో ఉచ్చరించవచ్చును. కాని భగవంతుడు మానవాకారమును ధరించినప్పుడు, మానవుల మధ్య సంచరించేటప్పుడు మానవులకు సరియైన పాఠములను నేర్పుతూరావాలి. భగవంతునికి ఆగ్రహము, అనుగ్రహము రెండూ లేవు. అతనికి ఏ విధమైన తన పర భేదములు లేవు. అతనికి మెప్పులు కాని తిప్పలుకాని లేవు. ఈ మెప్పులు తిప్పలు, గొప్పలు లేని పరిస్థితి లోపల ఈ భగవంతుడు ఏ విధంగా నటించాలి ? ఇది ప్రతి మానవుడు కూడనూ విచారించవలసిన అంశము

కొంతమంది 'అయ్యో! స్వామి ఎన్ని పర్యాయములు వెళ్ళినప్పటికినీ మమ్మల్ని పలకరించడం లేదే ? ' అని అనుకుంటారు ' మాతో మాట్లాడడంలేదే ? స్వామికి మాపైన ఏమైనా కోపమేమో ? ' ఇది భ్రాంతి కాదిది పూర్తి అజ్ఞానం కారణమేమనగా స్వామి మనయొక్క నిజతత్వము గుర్తించుకోలేని సమయమందే ఇలాంటి భావాలు మనలో ఆవిర్భవిస్తుంటాయి 'నా కెవ్వరూ ద్వేషులు లేరు, నే నెవ్వరికీ ద్వేషిని కాను, అందరూ నావారే, నేను మీ అందరివాడనే. అయితే ఒక్కొక్క సమయం లోపల ఒక్కొక్క వ్యాధికి ఒక్కొక్క పథ్యం పెట్టవలసివస్తుంది. డైబిటిక్ పేషెంటు ఉంటాడు. అతనికి తీపి ఏమాత్రము ముట్టించకూడదు. 'అయ్యో ! నాకు తీపంటే చాలా ఇష్టము కదా ! ఎందుకీ సాయితల్లి నాకు తీపి అందించడం లేదు ? ' అనుకుంటే, అది నీ మంచికోసమే. నిజముగా నీ పైన ద్వేషముంటే తీపి ఇచ్చేసి నిన్ను నాశనం చేయవచ్చు. నీ పైన ఎంతో ప్రేమ ఉండటం చేతనే నీకు ఆ తీపిని అందించకుండా దూరం పెడుతున్నాడు. ఈ రోగాన్ని నివారణగావించే నిమిత్తమై ఈ విధమైన పథ్యాలు స్వామి అనుసరిస్తూవస్తుంటాడు. 'స్వామి నాతో మాట్లాడటం లేదు, స్వామికి నాపైన కోపము' అని కొంతమంది మా పిల్లలు కూడా అంటుంటారు నాకెవ్వరిపైనా కోపములేదు. నిజముగా మీరు నన్ను నమ్మినా నమ్మకపోయినా కోపమంటే ఏమిటో నాకు తెలియదు అయితే అప్పుడప్పుడు చాలా కోపంగా ఉండినట్లు నేను Show చేస్తాను అది చేయక తప్పదు నిజముగా ఆ విధంగా మాటలు కాని, ఆ విధమైన Action కాని చేయకపోతే ఈ పిల్లలు నామాట వినరు. వారికి ఏదో ఒక విధమైన ఆజ్ఞను శాసిస్తాను. కొంతమంది పిల్లలు ఆజ్ఞప్రకారము నడచుకొని సరి అయిన రీతిలో వారు జీవించడానికి ప్రయత్నిస్తారు. అయితే కొంతమంది ఆ ఆజ్ఞను ఉల్లంఘిస్తుంటారు అలాంటి సమయం లోపల నా గౌరవం కూడా నేను కాపాడుకోవలసివస్తుంది. నా మాటకు విలువ ఇవ్వని

# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI** - 515 134

ANANTHAPUR Dt. ANDHRA PRADESH

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

నెలకు రు 600/- ల స్కీములో చేరండి. (36 నెలలు) ప్రతి నెలా లాటరీ తీయబడును. బంపర్ డ్రా మారుతీ కారు. 2 సెంట్లు 20 × 40.

గమనిక : భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డెబ్బై (70) వ జన్మదిన శుభ సందర్భంగా 23-11-95 న శ్రీ సాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్టుమెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

వివరములకు :

గ్రంధి యుగంధర్
బాబా చైతన్య సూపర్ బజార్
గుంటూరివారి తోట,
గాంధీబొమ్మ దగ్గర
గుంటూరు - 522 001
Phone : 21988

ఇట్లు
శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రొ॥ పి. సిద్ధయ్యశెట్టి
ఆర్యవైశ్య సత్రం ఎదురుగా
పుట్టపర్తి - 515 134
Phone : 7413
S T D 08555

వారితో నేను మాట్లాడి ప్రయోజనం ఏమిటి ? కనుక నా మాటను నేను ఒక విలువలేకుండా చేసుకోవటం నాకు ఇష్టంలేదు. 'మాటకు ప్రాణము సత్యము' మాటకు సత్యమే లేకపోతే ఈ యొక్క పలుకు జీవించు నటువంటిదికాదు. కనుక మాటకు సత్యమే ప్రాణము కోటకు ప్రాణంబొసగునట కోటి ధరిత్రిన్ కోటకంతా సిపాయిలే దీనికి ప్రాణము. సిపాయిలే లేకపోతే ఆ కోటను కొల్లగొడతారు. మనిషికి ప్రాణము నీతే. ప్రామిసరీనోటుకు చేవ్రాలే ప్రాణము. Signature లేకపోతే ఆ నోటు చెల్లదు. అదే విధముగానే నా మాటకు ప్రాణము సత్యమే. కనుక నా మాటను నేను వేరుగా అసత్యముగా మార్చుకోవడం నాకు ఇష్టములేదు. నా మాటలు సరిఅయిన మార్గములో, సరిఅయిన రీతిలో నడుచుకోకుండా పోయినప్పుడు వారితో నేను మాట్లాడకుండా ఉంటాను.

దేనికోసం నా మాటలు నేను నిలబెట్టుకొనే కోసం కాని ఈ సత్యమును వారు గుర్తించుకొనలేక, స్వామి నాతో మాట్లాడటంలేదే అని అనుకొంటారు. అది చాలా పొరపాటు. నా మాటకు సరియైన విలువనిచ్చినపుడు నేను వారితో మాట్లాడి వారి అభీష్టములంతా కూడనూ, తీర్చి ఆనందాన్ని కూడను అందించటానికి నేను ఎప్పుడూ సంసిద్ధమే. నా కోసం నేను ఒక్కటి కూడా చేయటం లేదు. మీరు నమ్మినా నమ్మకపోయినా కూడనూ నా సత్యము నాదే ఇన్ని కోట్లు పెట్టి Hospital కట్టించాము ఎవరికోసం ? నా కోసమా ! ఇన్ని కోట్లు పెట్టి University నిర్మించాము ఎవరికోసం ? నా కోసమా! ఇంత పెద్ద Hall మీ కోసమై నిర్మించాము. ఇది చాలదే నని ఆ పెద్ద Hall మీ కోసమై నిర్మించాము. అన్నీ మీ కోసమేగదా ! ఈ సత్యాన్ని మీరెందుకు గుర్తించు కోడం లేదు. ఇంత తెలివితేటలు మీలో ఎందుకు లేక పోతున్నాయో అదే నాకు ఆశ్చర్యంగా ఉన్నది ఇంత తెలివిహీనులై ప్రవర్తిస్తున్నారే మీరు భక్తులు ! భక్తులు అనుకొనే స్వార్థము నా కాలు నుంచి తల వరకు ఎక్కడా కూడనూ లేదు కనుక నాకు ఎట్టి భయము లేదు. ఎందుకు భయమొస్తుంది ? దోషమున్న వానికే భయమువస్తుంది. కనుక నాలో ఎట్టి దోషములు లేవు ఎవరికీ నేను భయపడను. అయితే భక్తులకు లోబడతాను ఇలాంటి సత్యాన్ని వారు గుర్తించుకొన లేక కేవలము స్వామికి కోపము, మాపైన ద్వేషము, అని ఈ విధంగా భ్రాంతులు పడుతున్నారు ఇలాంటి భ్రాంతులను మీరు తుడిచివేసుకోండి ! స్వామి ఏమి చెప్పిన మా మంచికోసమని మీరు విశ్వసించి దానిని ఆచరించండి! మీరు బాగుపడితే వచ్చేటటువంటి ఆదాయం నాకేమీ లేదు మీరు చెడిపోతే వచ్చేటటువంటి నష్టము నాకేమీ లేదు. ఆ విధమైనటువంటి కష్టమునకు, నష్టము నకు గురికాకూడదనేటటువంటి ఉద్దేశ్యముతోనే మిమ్మల్ని ఇన్ని విధములుగా ప్రేమిస్తున్నాను.

ఈ ప్రేమను కూడను అర్థము చేసుకోలేనటువంటి వారు నూటికి తొంభైతొమ్మిదిమంది ఉంటున్నారు. ప్రేమంటే ఏమిటో అర్థమే చేసుకోలేరు. ఈ ప్రేమను లౌకికమైనటువంటి ప్రేమగా భావిస్తున్నారు. అదియే పెడ మార్గం పట్టిస్తున్నది. భార్యాభర్తల ప్రేమ ప్రేమంటున్నారు. తల్లిబిడ్డల ప్రేమ ప్రేమంటున్నారు. మిత్రుల ప్రేమ ప్రేమంటున్నారు. బంధువుల ప్రేమ ప్రేమంటున్నారు. ఇవేవీ ప్రేమ కాదు. ఈ భార్యాభర్తల ప్రేమ మధ్యలో చేరినటువంటిదే పెళ్ళి కాక పూర్వం భార్య ఎవరు? పెండ్లి అయిన తరువాతనే ఈ ప్రేమ వచ్చింది ఇది ప్రేమ అని చెప్పరాదు, దీనిని అనుబంధము (Attachment) అంటారు ప్రేమ అంటే ఏమిటి ? "త్రికాల బాధ్యం ప్రేమ" Past, Present, Future లో కూడా మార్పు చెందనటువంటిది ప్రేమ. కనుక, అట్టిప్రేమ ఒక్క భగవంతునికి, భక్తునికి మధ్య నున్నటువంటి సంబంధమే కాని వీరందరికీఉన్న సంబంధ మును ప్రేమ అని చెప్పకూడదు. కనుక, క్షణములో పెరిగి క్షణములో తరిగేటటువంటిది ప్రేమకాదు. ఎప్పటికీ స్థిరమైనటువంటిదిగా ఉండేటటువంటిదే ప్రేమ. అదియే భగవంతుడు, అదియే 'Love is God, Live in

Love ' ఇలాంటి ప్రేమతత్త్వమును మనం సరియైనటువంటి మార్గములో ప్రవేశపెట్టుకోవాలి ఈ అల్పమైనటువంటి వాంఛలచేత, అల్పమైనటువంటి కోరికలచేత ఏదో అప్పటికప్పుడు మీరు పాలు పొంగినట్లు పొంగుతూ ఉంటారు. అవి తీరితే ఉప్పొంగుతారు. తీరకపోతే పూర్తిగ క్రుంగుతారు. కాని, భగవంతుని ప్రేమ పొంగి కుంగనటువంటి ప్రేమ. కనుక అట్టి, పొంగి క్రుంగనటువంటి ప్రేమతత్త్వాన్ని మనం తెలుసుకొనటానికి తగిన కృషిచేయాలి. ఈ ప్రేమ స్వామిసన్నిధిలో ఉండినంతవరకు కూడను చాలా ఆనందంగా పూర్తి నిండుగా ఉండినట్టుగా కనిపిస్తుంది. తిరిగి బయట వాతావరణానికి పోయేటప్పటికి ఇదంతా తరిగిపోతుంది. దీనికి కారణమేమిటి ? ఇక్కడ ఉండినంతవరకు మీ హృదయంలో భగవద్భక్తి నింపుకొంటారు. మీరు మీ ప్రదేశాలకు వెళ్ళినపుడు ఆ చుట్టూ ఆ భగవత్ వాతావరణం అనేటటువంటిది లేకపోవటంచేత ఈ లోపల ఉన్నటువంటి భగవత్ వాతావరణం తగ్గిపోతూ వస్తున్నది. కనుక బయట లోపల కూడనూ భగవత్ వాతావరణాన్ని మనం పెంచుకోవాలి. కనుకనే ప్రతి గ్రామమునందుకూడనూ, ప్రతి పల్లెయందుకూడను, ప్రతి వాడయందుకూడనూ, ప్రతి బాటయందుకూడనూ, ప్రతి మాటయందుకూడను, ప్రతి పాటయందుకూడనూ మనం భగవత్ నామాన్ని ఉచ్చరిస్తూరావాలి ఇది ఎవరి కోసము? మనలో ఉన్నటువంటి ఈ ప్రేమతత్త్వము తరిగిపోకుండా ఉండేటందుకోసమని దీనివల్ల భగవంతుని కొచ్చేటటువంటి ఆదాయం ఏమియునూ లేదు భగవంతుడు ఏదీ కావాలని ఆశించడు. ఇదంతా నిన్ను నీవు పోషించుకోవడంకోసమే నిన్ను నీవు ఉద్ధరించుకోవడానికే, ఈ సత్యాన్ని అనేకమంది గుర్తించుకొనలేక ఇదేదో సాయిబాబా పేరుప్రతిష్టలకోసమని అఖండ భజనలు ఈ ఉత్సవాలు ఇవన్నీ చేస్తున్నారని భావిస్తున్నారు. పరమ మూర్ఖులు వారు. సాయిబాబా దేనిని కూడను ఆశించడు. మిమ్మల్ని మీరు తరింపచేసుకోండి. మీరు మీరు బాగుపడండి. మీ ఆనందాన్ని మీరు అనుభవించండి. మీ ఉన్నతస్థాయిని మీరు అందుకోండి ! దాని నిమిత్తమై ఈ విధమైనటువంటి ఉపాధులను, ఈ మార్గములో ప్రవేశపెట్టాలి.

సర్వరూప ధరం శాంతం సర్వనామ ధరం శివం
సచ్చిదానందరూపం అద్వైతం సత్యం శివం
సుందరమ్

మీ రూపములన్నీ శాంతముసందే ఇమిడి ఉంటున్నావి. మీ రూపమంతా శివమనేటటువంటి ఆకారంతో ధరించి ఉంటున్నాది. ఇదే నిజమైన అద్వైతం. భగవత్ స్వరూపము. మొట్టమొదట మానవుని మనస్సు నుండి ఆవిర్భవించినటువంటిది ప్రేమ మొట్టమొదటిది. ఆ ప్రేమ పుట్టినతరువాతనే అన్నీ పుడుతున్నాయి కనుకనే పుట్టిన తక్షణమే తల్లిపైన ప్రేమ వస్తుంది. ప్రతివాడు మొట్టమొదట తల్లి, తండ్రిని గుర్తించడానికి ప్రయత్నిస్తాడు ఏవిధంగా వ్యక్తి తన జీవితంలో పుట్టిన వెంటే తల్లిదండ్రులను ఏ రీతిగా గుర్తించటానికి ప్రయత్నించుతాడో అదే విధముగనే ప్రతి వ్యక్తి కూడనూ మనం పుట్టిన దేశమునూ సంస్కృతిని తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. మన దేశము, మన సంస్కృతియే మన తల్లిదండ్రులు దేశమే తల్లి. ఇది మాతృభూమి మన సంస్కృతి తండ్రి. దీనిని పురస్కరించుకొనియే రాముడు " జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి " దీనికంటే స్వర్గము మరియొకటి లేదన్నాడు తల్లిని ప్రేమించు. తల్లియొక్క సంస్కృతిని ప్రేమించు - అదియే ప్రతి మానవుని యొక్క ప్రధాన కర్తవ్యము. ఈ ఆచరణ లేకపోయినప్పటికైన ఇవన్నీ నిరుపయోగమే. గొప్ప పండితుడు కావచ్చును, పాండిత్యము ఉండవచ్చును. కాని Practical లేదు. ఉండి ప్రయోజనమేమిటి? ఈ విధంగా మనకు అన్నీ ఉంటుండి ఆచరణలో లేకపోతే ప్రయోజనంలేదు కనుక, ఒక్కటైనా మనం ఆచరణలో పెట్టి మనం ఆనందించాలి.

ప్రేమస్వరూపులారా !

ఈనాడు ఎక్కడ చూచినా అన్యాయము అక్రమము, అనాచారము, అసత్యము, హత్యలు ఇలాంటివన్నీ జరుగుతున్నాయి. దీనికి కారణమేమిటి ? స్వార్థమే దీనికి కారణము, కోర్కెలే దీనికి కారణము. కోర్కెలు ఫలించకపోవటం చేతనే ఈవిధమైనటువంటి దుర్మార్గములో ప్రవేశిస్తున్నారు. కనుక, కోర్కెలను తగ్గించు

కోవటానికి మనం భగవత్ నామ స్మరణ ఎక్కువగా చేయాలి పండరీపురము చేరాలని పాండురంగడిని దర్శించాలని సక్కుబాయి ఎంతో ప్రార్థించింది. ఎన్ని కష్టములకైనా దుఃఖములకైనా కూడనూ తాను భరించుకొంది. ఆ విధమైనటువంటి యొక్క నిగ్రహముచేతనే దైవానుగ్రహాన్ని పొందగలిగింది. విగ్రహమే లేకపోతే అనుగ్రహాన్ని ఏ రీతిగా పొందగలం? బంగారమునయినా నగ చేయించాలంటే దానిని అగ్నిలో వెయ్యాలి. సుత్తితో కొట్టాలి, సాగనరకాలి, అతికించాలి, Cutting చెయ్యాలి. ఇన్ని రకములుగా దాన్ని బాధ పెట్టినపుడే అది సుందరమైన నగగా తయారవుతుంది. కష్టములు పడకుండా సుఖాన్ని పొందాలంటే ఎట్లా పొందడానికి వీలవుతుంది ? సుఖము పొందాలంటే, ఆనందాన్ని అందుకోవాలంటే కష్టమును అనుభవించేతీరాలి దానికి మనం సిద్ధంగానే ఉండాలి. Heart జబ్బు వచ్చింది, డాక్టర్ తక్షణమే దీనికి Operation చేయాలంటాడు. ఈ Operation లోపల ఎంతో క్రూరంగా వ్యవహరించవలసి ఉంటుంది ఒక రంపము తీసుకొని మధ్య నున్న ఎముకను కోయాలి. ఆ విధమైనటువంటి బాధలు పెట్టిన తరువాతనే ఆ లోపల ఉన్నటువంటి Heart ను సరిచేయటానికి వీలవుతుంది. అయితే ఆ డాక్టర్ ఆ రోగి యొక్క క్షేమాన్ని కోరి, మంచిని కోరే రంపముతో కోస్తున్నాడు కాని అతని పైన ద్వేషముతో కాదు. అదే విధముగనే ప్రతి మానవుని యొక్క ఆనందము, క్షేమము మనం కోరినప్పుడు అతనికి కొన్ని చిక్కులు పెట్టేతీరాలి కనుకనే ' The Pleasure is an interval between two Pains ' ' రెండు బాధల మధ్య లోపలే సుఖముంటుండాలి' ఇది మీరు గుర్తించాలి. ఈ జగత్తును ఆడించే సూత్రధారి ఒకడు కలడు. రెండు కూడి ఒకటి అగును ఒకటిలోనే రెండు ఉండును, ఇది నిజమైనటువంటి జీవిత ప్రమాణము. జడము, చైతన్యము ఉంటుండాలి. దేహము దేహి ఉంటుండాలి, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు ఉంటుండాలి శరీరము శరీరి ఉంటుండాలి ఇవి రెండుగా ఉన్నప్పటికినీ రెండూ ఒక్కటే. నిజంగా భగవంతునియొక్క ప్రేమను అర్థం చేసుకుంటే ఈ త్యాగమనేటువంటిది చేతినుంచి విడిచిపెట్టినటువంటి బట్ట వంటిదిగా అవుతుంది. దీన్ని పట్టుకోవటం చాలా శ్రమ, వదలటం సులభం ఎప్పుడది సులభము ? భగవత్ప్రేమను అర్థం చేసుకున్నవారికి సులభము. అర్థం చేసుకోలేనివారికి కష్టము భగవంతుడు హృదయవాసి. 'హృదయమే భగవంతుని నిలయము' అనేటటువంటి విశ్వాసాన్ని పెంచుకొని ఆ హృదయం నుంచి వచ్చేటటువంటి ప్రేమతత్త్వాన్ని అందరికీ పంచటమే జీవిత కర్తవ్యమని గట్టిగా విశ్వసించండి. 'మనఏవమనుష్యాణాంకారణంబంధమోక్షయో' బంధమునకు, మోక్షమునకు మనస్సే కారణము కనుక మన మనస్సును మనం మొట్టమొదట సరిదిద్దుకోవాలి. మనస్సును విశాలం చేసుకోవాలి చాలా మంది తెలియనివారంతా స్వామీ ! నా Heart ని broad (హృదయాన్ని విశాలం) చేయండి అంటారు చాలా మంది. Heart broad చేస్తే Hospital కి పోవలసి వస్తుంది. enlargic heart అంటారు. Heart enlarge చెయ్యకూడదు మనము. Mind ని enlarge చేసుకోవాలి. (మనస్సును విశాలం చేసుకోవాలి) అదే expension love, expension love ఈ దుర్మార్గమైన భావాల లోపల contraction love. అదే Death (మరణం) 'Expension love is life'. ఆLife లో మనముండాలి. ఈ విధమైనటువంటి యొక్క సూక్ష్మమైనటువంటి భక్తి మార్గము భక్తి కంటే సులభమైనటువంటిది మరియొకటి లేదు. కనుక మనం భక్తి మార్గములో ప్రవేశించి, ఆ భక్తిలో కూడనూ నిర్మలమైన ప్రేమను పెంచుకొని, ఆ ప్రేమను పరమాత్మ ప్రేమలో అంకితం గావించినపుడు 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' రెండూ ఏకమై పోతాయి. కనుక, నిరంతరము భగవత్ చింతనచేయండి భగవత్ నామాన్ని పదిమందికి పంచినప్పుడే మనం ఆనందించగలం. ఈ యొక్క ఆనందానికి మీరు నోచుకొని, మీరు శాశ్వతమైన కీర్తిని పొంది, ఆదర్శవంతమైన జీవితాన్ని అనుభవిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను (14-1-95)